30.8.1996 శుక్రవారం 14 పేజీలు సంపుటి:68 సంచిక:35 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



# దేశం ఎమ్పీలకు దేవగౌడ వల?

**చంద్రబాబు బెదిరింపు వ్యూహం త్రిప్పికొట్టడానికి తెలుగుదేశం పార్టీలో చీలికకు లోలోపల ప్రయత్నాలు ప్రారంభం - కేంద్రంలోని తెలుగు మంత్రులూ ఇందుకు సిద్ధమని ప్రచారం!**

ఆల్‌మట్టి విషయంలో ప్రధాని దేవగౌడను బెదిరించి లొంగ దీయాలనుకున్న చంద్ర బాబు వ్యూహం బెడిసి కొట్టింది. తన హెచ్చరికలకు దేవగౌడ చీపుర పుల్లపాటి విలువ ఇవ్వకపోగా, తన పార్టీ ఐక్యతను దెబ్బతీసేందుకు లోపాయికారీగా ప్రయత్నిస్తున్నాడని తెలియడంతో చంద్ర బాబుకు ఊపిరాడటం లేదు.

ఆల్‌మట్టికి సంబంధించి దేవగౌడ చంద్ర బాబునే కాదు. ఐక్య ఫ్రంట్‌లోని ఇతర ముఖ్యమంత్రులనూ పట్టించు కోవడం లేదు. నలుగురు ముఖ్యమంత్రుల కమిటీ పంపే నిపుణుల సంఘాన్ని తన రాష్ట్రంలోకి రానివ్వనని కర్ణాటక ముఖ్య మంత్రి చేసిన ప్రకటన దేవగౌడ ఆలోచనా తీరుకు అద్దం పడుతూంది. నిపుణుల సంఘంలో కేంద్ర జలసంఘం ఇంజనీర్లు పాల్గొనకుండా అడ్డం పెట్టడం ద్వారా దేవగౌడ ఇంతకు మునుపే తన వైఖరిని స్పష్టం చేశారు. పార్లమెంట్‌లో ఆంధ్ర ఎమ్పీలు ఈ విషయం ప్రస్తావిస్తే కర్ణాటక ఎమ్పీలను వారిపైకి ఉసిగొల్పా రాయన. ఆరు నూరైనా సరే – ఆల్‌మట్టి డ్యాంను నిర్మించి తీరాలన్నది దేవగౌడ పంతం; అట్లని తన పదవిని వదులుకొనేందుకు సిద్ధంగా లేరు. మొన్న తన స్వరాష్ట్ర పర్యటనలో ఈ రెండు అంశాలనూ స్పష్టంగా, చంద్రబాబాదులకు అర్థమయ్యేటట్లు బహిరంగ సభలలో ప్రకటించారు కూడా!

కర్ర విరగకుండా, పామూ చావకుండా పని చక్క బెట్టుకోవ డానికి దేవగౌడ తెలుగు దేశం పార్టీలో చీలికకు ప్రయత్నం ప్రారంభించినట్లు సమాచార మందుతూంది. ఆనాడు పివి నరసింహారావు జార్ఖండ్ ముక్తి మోర్చాను చీల గొట్టినట్లు, ఈనాడు తెలుగు దేశంను చిందర వందర చేసి ఢిల్లీ రాజకీయాలలో చంద్ర బాబుని నిర్వీర్యుడ్ని చేయాలన్నది దేవగౌడ పథకమట. ఇందుకోసం ఆయన ఢిల్లీలోని ఒక తెలుగు మంత్రిని లోబరచు కున్నాడని చెప్తున్నారు. ఆ మంత్రి ద్వారా అరడజను మంది ఎమ్పీలకు బ్రెయిన్ వాష్ జరుగు తూందిప్పుడు.

చంద్ర బాబు పంతానికి పోయి తనకు మద్దతు వుపసంహరిస్తే – తదుపరి ఏ ప్రభుత్వమూ వచ్చే అవకాశం లేదని; మధ్యంతర ఎన్నికలే శరణ్యమౌ తాయని ప్రధాన మంత్రి ఎమ్పీలను భయపెడ్తున్నారు. ఎన్నిక లంటూ వస్తే మళ్లీ గెలవడం పట్ల ఏ ఎమ్పీకి నమ్మకం లేదు. అందువల్ల చూస్తూ చూస్తూ ఆ పరిస్థితి తెచ్చుకోవద్దని దేవగౌడ సలహా ఇవ్వడంతో, వారు ముఖ్యమంత్రిపై వత్తిడి చేస్తున్నారు. ఆల్‌మట్టికి కేంద్ర ప్రభుత్వ భాగస్వామ్యానికి లంకె కలప వద్దన్నది ఎమ్పీల వాదన. కేంద్ర మంత్రు లందరి భావనా ఇదే. చంద్ర బాబు తమ మాట వినకపోతే ఆయనతో తెగతెంపులు చేసుకొని, చీలిక వర్గం

కొరవ 8 పేజీలో

# ఆల్‌మట్టిపై అయోమయం- కాంగ్రెస్ నేతల నీచత్వం!

**ఉపేంద్ర వంటి నేతలు ఢిల్లీలో ప్రధానితో లాలూచీపడి ఉద్యమాన్ని నీరుగారుస్తున్నారు; పి.జనార్దనరెడ్డిది ఒంటరి పోరాటమైంది!**

తెలుగు దేశం ఎమ్పీలతో పాటు, ఆంధ్ర కాంగ్రెస్ పార్లమెంట్ సభ్యులనూ లోబరచు కొనేందుకు ప్రధాని దేవగౌడ ప్రయత్నిస్తున్నట్లు రూఢీగా తెలుస్తూంది. పార్లమెంట్ సమావేశాలలో ఆంధ్ర కాంగ్రెస్ ఎమ్పీలెవరూ ఆల్‌మట్టిని ఒక సమస్య చేయకుండా నివారించేందుకు ఆయన, మాజీ మంత్రి ఉపేంద్రతో ఒక ఒప్పందం కుదుర్చుకొన్నట్లు వినికిడి. ఉపేంద్రకు వ్యాపారం ప్రథమం; రాజకీయం వ్యాపారాభివృద్ధికి ఒక ఉపకరణం మాత్రమే. తన రాజకీయ పలుకుబడితో – తన బంధువుల పిల్లల చేత ప్రారంభింప చేసిన పరిశ్రమలను ఆయన అత్యంత శీఘ్రంగా అభివృద్ధి చేస్తున్నారు. స్టీలు, సిమెంట్, విద్యుత్ రంగాలలో ఆయన పరిశ్రమలు స్థాపించారు. వాటికి సంబంధించిన పనుల కోసం ఆయన దేవగౌడతో ఇటువంటి లాలూచీ ఒప్పందం కుదుర్చుకొన్నట్లు వదంతిగా వుంది. అందువల్లే ఆయనీ విషయంలో ఢిల్లీలో మౌనంగా వుండి పోతున్నారు; విజయవాడలో మాత్రం జనం కళ్లనీళ్లు తుడవడానికి సభలు పెట్టి, ప్రకటన లిస్తున్నారు. పార్లమెంట్ సభ్యుల కన్వీనర్‌గా తతిమా కాంగ్రెస్ ఎమ్పీలనూ ఉద్యమోన్ముఖులను చేయవలసిన ఉపేంద్ర – లోకసభలో తెలుగు దేశం సభ్యులు అంత ఆందోళన చేస్తున్నా ఉలుకు పలుకు లేకుండా వుండి పోవడంలోని అంతర్యం దేవగౌడతో ఆయనకు కుదిరిన లాలూచీయేనని చెప్తున్నారు.

ప్రలోభాలతో, పలుకుబడితో కాంగ్రెస్ నేతలను దేవగౌడ లోబరచు కుంటున్నప్పటికీ – హైదరాబాదులో మాత్రం శాసన సభాపక్షం నాయకుడు శ్రీ పి. జనార్దన రెడ్డి ఒంటరి పోరాటం చేస్తూనే వున్నారు. ఆల్‌మట్టి సమస్య ఇంతటి సంచలనాత్మక ఉద్యమంగా రూపొంద డానికి ఏకైక కారణాలు పి. జనార్దన రెడ్డి, ఎమ్మెల్యేలను, పత్రికా ప్రతినిధులను ఆల్‌మట్టి డ్యాం వరకు తీసుకువెళ్లి, అలజడి ప్రారంభించింది ఆయనే! ఆంధ్ర ఎమ్పీలను పిలిచి, సమావేశం జరిపి, వారికి సమస్య పూర్వోత్తరాలు వివరించి లోకసభలో అలజడి ప్రారంభించమని కోరింది ఆయనే.

కొరవ 8 పేజీలో

# ముందున్నది ముసళ్లపండగ

భారతీయ ఆర్థిక వ్యవస్థలో వేగంగా సంభవిస్తున్న పరిణామాలు చూస్తుంటే ముందున్నది మంచి కాలం కాదేమో నన్పిస్తుంది. విదేశీ మారక ద్రవ్యానికి సంబంధించి ఈ మార్పులు మరీ ఆందోళన కరంగా వున్నాయి. రాజకీయ అస్థిరత్వం వల్ల భారత ఆర్థిక విధానాలపై విదేశీయులలో నమ్మకం కన్పిస్తున్నది. దేవగౌడ ప్రభుత్వం ఏ క్షణంలోనైనా పడిపోవచ్చునన్న అభిప్రాయంలో వున్నారు విదేశీయులు. అందువల్ల మన దేశంలో కొత్త పెట్టుబడులు పెట్టడానికి వారు ఆసక్తి చూపడం లేదు. 95-96 సంవత్సరంలో విదేశీ పెట్టుబడి కేవలం 7వేల కోట్లు. ఈఏడాది ఈ పెట్టుబడిని కనీసం 37వేల కోట్లుగా పెంచాలనే లక్ష్యంతో పనిచేస్తున్నారు -ఆర్థిక మంత్రి శ్రీ చిదంబరం. కాని. ప్రభుత్వం స్థిరంగా సాగుతుందనే విశ్వాసం లేక విదేశీయులు ఆయన ఆహ్వానాన్ని మన్నించడం లేదు. అన్ని క్లియరెన్స్‌లూ పూర్తి అయిన ఎన్‌రాన్ ప్రాజెక్టు సైతం ఇప్పటికీ పని ప్రారంభించలేదు.

**డాలర్‌ధర రూ37లకు ఎగబ్రాకుతూంది!**

దేశంలో విదేశీ నిధుల నిల్వ శరవేగంగా పడిపోతున్నది. మొన్న జూలై ఆఖరుకు కేవలం 62వేల కోట్లు (17.7 బిలియన్ డాలర్లు) మాత్రమే వున్నాయి. గత ఏడాది ఇదే సమయానికి 70వేల కోట్లు (20బిలియన్ డాలర్లు) వుండినాయి. ఇంకొక ప్రక్క విదేశాలలో చేసిన అప్పు 3లక్షలా 50వేల కోట్లకు పెరిగి పోయింది. 1992లో, అది 2లక్షల 63వేల కోట్లు మాత్రమే. అంటే నాలుగేళ్లలో లక్షకోట్ల అప్పు పెరిగిందన్న మాట. దీనిపై ఏడాదికి 40వేల కోట్ల వడ్డీ చెల్లించవలసి వస్తున్నది. కనీసం ఏడాదికి 75వేల కోట్ల విదేశీ ధనం దేశం లోపలకు వస్తే తప్ప ఆర్థిక మంత్రి పనిచేయలేరు.

ఈ విదేశీమారక ద్రవ్యం కొరత వల్ల డాలర్ ధర పెరిగిపోతూంది. త్వరలోనే అది రు37లు అవుతుందని అంచనా - చిదంబరం వచ్చిన తర్వాత ఇన్‌కంటాక్స్, ఇన్‌డైరెక్ట్ టాక్స్‌లు పెంచడం మినహా మన్‌మోహన్ పాటించిన విధానాలు వేటినీ

కొరవ 7 పేజీలో

# తెగుళ్ల మందుల షేర్లు బాగుంటాయి!

డాక్టర్ ఎ. దుర్గాప్రసాద్

ఈ సంవత్సరం రుతు పవనాలు బాగున్నాయి. పశ్చిమ కోస్తా రాష్ట్రాలలో వానలు బాగా కురిసాయి. తూర్పు కోస్తాలోనూ ఇప్పటి వరకు వర్షపాతం సంతృప్తి కరంగా వుంది. అందువల్ల పంటల సాగు విస్తారంగా జరుగుతుందని భావించాలి. ఇంకొక ప్రక్క దేవగౌడ ప్రభుత్వం వ్యవసాయానికి అధిక ప్రాధాన్యత ఇస్తున్నది. బడ్జెట్‌లో ఈ రంగానికి నిధులు ఎక్కువగా కేటాయించారు. ఈ పరిస్థితులలో వ్యవసాయ సంబంధిత ఉత్పత్తులు చేసే కంపెనీలకు మంచి వ్యాపారం వుంటుంది. ఎరువులు, తెగుళ్ల మందులు, విత్తనాలు, వ్యవసాయోప కరణాలు, ప్రాసెసింగ్ పరిశ్రమలకు మంచి వ్యాపారం చేసే అవకాశం వుంది. పెస్టిసైడ్ కంపెనీల షేర్లు బాగుంటాయి. వాటిని కొనుగోలు చేయవచ్చు.

### భారత రసాయన్

ఈ కంపెనీ షేర్ ధర ఇప్పుడు రు27లు; చిన్న ఈక్విటీ - 4.25కోట్ల రూపాయలు - కలిగిన పరిశ్రమ ఇది. మార్చి96 నాటికి 36కోట్ల వ్యాపారం చేశారు. రు 7ల ఇపిఎస్ సాధించారు. ఈ కంపెనీకి ఈ ఏడాది లాభాలు మరింత పెరిగే అవకాశం వుంది. షేర్ ధర కనీసం రు35లకు పెరుగుతుంది. కొనదగిన షేర్ ఇది.

### ఫోర్డు కార్లు రెడీ

అమెరికాకు చెందిన ప్రపంచ ప్రఖ్యాత ఫోర్డు కార్లు భారత రోడ్లపై తిరగనారంభించాయి. మహారాష్ట్రలోని నాసిక్‌లో మహేంద్ర అండ్ మహేంద్ర వారు నెలకొల్పిన ఫ్యాక్టరీ నుంచి తొలి కారు ఇటీవలే బయటకు వచ్చింది. భారతీయ పరిస్థితులకు అనుగుణంగా షాక్ అబ్జార్బర్లు, సస్పెన్షన్ సిస్టం, ఎయిర్ కండిషనింగ్‌లు ఏర్పాటు చేసిన

కొరవ 7 పేజీలో





# సోమశిల నీళ్లెందుకు వృథా చేస్తారు– కనుపూరు చెరువులు నింపకూడదా?

వసూళ్ల బాధ్యత జిల్లాల్ని ఫీల్డు గాని ఆడిట్ బోర్డు డైరెక్టర్ల నుంచి గాని, కేంద్రం నుంచి గానీ ధృవీకరణ పొందకుండానే ఒక సొసైటీ వసూళ్లు చేయడం ఎన్నో అనుమానాలు కలుగ చేస్తోంది.

దీనికంతటికీ కారణం కావలి పాతూరుకు చెందిన ఒక వ్యక్తి అట; సొసైటీ ప్రెసిడెంటు యితనికి మంచి మిత్రుడు కావడమే గాక, అతనికి ఈ

**జిల్లావార్తలు**
ఐదవ పేజీ కొరవ

వ్యవహారాలపై అనుభవం లేకపోవడంతో యిలా బయటి వ్యక్తులపై ఆధారపడాల్సి వస్తోంది. సొసైటీ వైస్ ప్రెసిడెంటు కూడా బంధుప్రీతితో ఊరుకున్నట్లుగా వుంది. మిగతా 12మంది డైరెక్టర్లు కూడా నోరు మెదపక పోవడంతో తమ పనులు మరీ సులువుగా చేసుకుంటున్నారు. ఏదో ఒక రూపేణా కావలి ట్రంకురోడ్డులో వున్న ఈ కార్యాలయాన్ని ఆక్రమించేందుకు ప్రయత్నాలు జరుపుతున్నట్లు బ్యాంకు అధికారులు భయపడు తున్నారు.

కాంగ్రెస్ పార్టీకి చెందిన ఈ వ్యక్తి విషయం తెల్సి తనకు దూరంగా పెట్టిన 'కలికి' సొసైటీలో యితని పెత్తనాన్ని ఎలా చూస్తూ వూరుకుంటున్నారో అర్థం కావడం లేదు. యిప్పటికైనా ఉన్నతా ధికారులు కలుగ చేసుకొని వ్యవహారం చక్కదిద్దాల్సిన అవసరం వుంది.

## కనుపూరు కాల్వకు నీరు

సోమశిల రిజర్వాయర్ నుంచి వృథాగా సముద్రానికి పోతున్న నీటిని కనుపూరు కాలువ ఆయకట్టులోని చెరువులకు తరలించాలని మాజీ శాసన సభ్యుడు శ్రీ సివి శేషారెడ్డి కోరుతున్నారు.

కనుపూరు కాలువ క్రింద తిక్కవరప్పాడు, మరమనూరు, జట్ల కొండూరు, కంటేపల్లి, కనుపూరు, సర్వేపల్లి చెరువులు వున్నాయి. సోమశిల నిర్మాణం పూర్తి కాక మునుపు ఈ చెరువులకు జనవరి నెలలో మాత్రమే నీరు వదలాలనే నిబంధన వుండేది. నెల్లూరు, సంగం ఆనకట్టల క్రింద జిల్లాను కాపాడడం కోసం తీసుకొన్న నిర్ణయమది.

కాని ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. ఈ ఏడాదిలో సోమశిల రిజర్వాయర్‌కు రెండవసారి నీళ్లు వచ్చాయి. గత వారం కడపలో కురిసిన భారీ వర్షాలకు సోమశిల నిండిపోయింది. అందులో 37 టిఎంసిల కంటే అదనంగా నిల్వ చేయలేక పోవడం వల్ల మిగులు నీటిని వృథాగా సముద్రానికి వదిలేస్తున్నారు.

సోమశిలకు ఇది అనుకోని వరద. కడప, నెల్లూరు జిల్లాలలో రుతుపవనాల వర్షం నవంబరు వరకు కురుస్తుంది. ఇప్పుడు సోమశిల సగానికి ఖాళీ అయిపోయినా నవంబరు నాటికి మరొక సారి నిండుతుంది. అందువల్ల నీటిని వృథా చేసేకంటే కనుపూరు, కావలి, సర్వేపల్లి కాలువల క్రింద వున్న చెరువులకు నీరు వదలడం రైతు శ్రేయస్సుకు వుపకరిస్తుందని సివి శేషారెడ్డి కోరుతున్నారు.

ఇది సమంజసమైన కోరిక. ముఖ్యమంత్రి దృష్టింతా మద్రాసుకు నీళ్లివ్వడంపైనే కేంద్రీకృతమై వుంది. అందువల్ల సోమశిల నీటిని కండ్లేరు రిజర్వాయరుకు తరలించమని ఆదేశించారు. కాని కండ్లేరులో ఇప్పటికే 11టిఎంసిల నీళ్లున్నాయి. ఇవన్నీ పెన్నానీళ్లు. శ్రీశైలం నుంచి చుక్కనీరు లేకుండానే పెన్నా నీటిని మద్రాసుకు పంపబోతున్నారు. అట్లా చూసినా కండ్లేరులో ఇప్పుడున్న 11టిఎంసిల నీరు మద్రాసుకు సరిపోతాయి. కండ్లేరు క్రింద కేవలం 16వేల ఎకరాల ఆయకట్టు మాత్రమే వుందిప్పుడు. దానికి మూడు లేదా నాలుగు టిఎంసిల నీరు చాలు. ఈ పరిస్థితిలో సోమశిల నుంచి కండ్లేరుకు అదనంగా నీరు తరలించడం అనవసరం. వున్న నీటిని వుపయోగపడని కండ్లేరుకు; మిగులు నీటిని సముద్రానికి వదిలే కంటే – కనుపూరు, కావలి కాలువల ఆయకట్టుకు వదిలితే వేలాది ఎకరాలలో పంటలు పండుతాయి. జిల్లా ఎమ్మెల్యేలు, మంత్రులు తక్షణం ప్రభుత్వంతో సంప్రదించి, అనుమతి తేవలసిన విషయమిది.

## లక్షా 50వేలు స్వాహా చేసిన ఎమ్డీఓ?

కుంభకోణాల్లో రాజకీయ నాయకుల కంటే తానేమీ తక్కువ తినలేదని కావలి ఎమ్డీఓ నిరూపించారు. హస్తలాఘవం చూపి లక్షా 40వేల రూపాయలు దొంగ బిల్లు రూపంలో దిగమింగారని ప్రాథమికంగా రుజువు కావడంతో మండల సమావేశంలో పార్టీల కతీతంగా సభ్యులందరూ ఎమ్డీఓపై సి.బి.సి.ఐ.డి చేత దర్యాప్తు జరిపించాలని తీర్మానించారు. 24తేది జరిగిన మండల సమావేశంలో పలువురు సభ్యులు అజెండాలో చూపించకుండా టెండర్లు, పత్రికా ప్రకటనలు, కొటేషన్లు, ఎస్టిమేషన్లు లేకుండా ఏవిధంగా బిల్లులు పాస్ చేసుకొన్నారని ఎమ్డీఓను నిలదీశారు. ఈవిధంగా బిల్లులు చేసుకొన్న లక్షా 40వేల రూపాయలకు లెక్క చూపించమన్నారు. బండారం బయట పడడంతో ఎమ్డీఓ సత్యనారాయణరెడ్డి మౌనమే నా భాష ఓమూగమనసా అన్నారు. ఈ దాడిని ముందుగానే పసిగట్టి సమావేశం ప్రారంభం కాకమునుపే సభకు హాజరైన సభ్యుల చేతసంతకాలు చేయించను సిబ్బందిని పురమాయించారు. గత సమావేశాల్లో చేయని తీర్మానాలు చేసినట్లు వ్రాసుకోవడం ఎమ్డీఓ అంతర్యమని తెలుసుకొన్న సభ్యులు ససేమిరా సంతకాలు వేయమని చెప్పారు.

సమావేశం ప్రారంభం కాగానే తెలుగుదేశం ఎమ్పీటీసి సభ్యుడు కృష్ణ లేచి నిలబడి జనరల్ ఫండ్స్ వివరాలు తెలుపమని ఎమ్డీఓను అడిగారు. పుస్తకాలు ఆడిటుకు వెళ్లాయని తప్పించుకో చూశారు ఎమ్డీఓ. కాని సభ్యులందరూ జనరల్ ఫండ్స్ వివరాలు తెలిపితే గాని సమావేశం జరగ నివ్వమని ధర్నాకు దిగడంతో ఎమ్డీఓ విధిలేక పుస్తకాలు సభ ముందుంచారు. సిబిసిఐడి దర్యాప్తుకు సభ తీర్మానించినట్లు మినిట్స్ పుస్తకంలో వ్రాసిన తరువాత సభ ముగిసింది. మండలాధ్యక్షురాలు శ్రీమతి వాకా మంజుల ఎమ్డీఓను వెనుదశల్లో సమర్థించను ప్రయత్నించారు. దీనిలో మతలబు ఏమిటో దర్యాప్తులో గాని వెల్లడికాదు.

## అనంతసాగరంలో చిల్లర దొంగతనాలు

అనంతసాగరం మండలంలో ఇటీవల చిల్లర దొంగతనాలు ఎక్కువయ్యాయి. పేకాట, బొమ్మ - బొరుసు, చింతగింజల ఆటలు ఆడే జులాయిలు ఎక్కువ కావడంతో చిల్లర దొంగతనాలు పెరిగిపోయాయి. ఇళ్లలో బిందెలు, చెంబులు, దేవాలయాల్లోని గంటలు, పాఠశాలల్లోని టేకు బల్లలను చిల్లర దొంగలు తమవిగా చేసుకొని బల్సాగా తమ వ్యసనాలకు ఉపయోగించు కొంటున్నారు. పోలీస్ స్టేషన్‌లో సిబ్బంది డ్యూటీలకే చాలడం లేదని అందువల్ల చిల్లర దొంగలను ఏమీ చేయలేక పోతున్నామని చెప్పి, పోలీసులు తప్పించు కొంటున్నారు. చిల్లర దొంగలు, పెద్ద దొంగలుగా మారక ముందే పోలీసులు మేలు కోవడం మంచిది.

## అలరించిన యాచేంద్ర గేయధార

అష్టావధాన ప్రక్రియ ఆలంబనగా సంగీతాన్ని, సాహిత్యాన్ని మేళవించి వెంకటగిరి మాజీ సంస్థానాధీశుడు సాయికృష్ణ యాచేంద్ర నిర్వహించిన గేయధార కావలి ప్రజలను అలరించింది. యాచేంద్ర తన 127వ ప్రదర్శనను ఇటీవల కావలిలో రసరమ్యంగా నిర్వహించి ప్రజల ప్రశంసలు పొందారు.

పృచ్ఛకులుగా డాక్టర్ జి.వి. సుబ్బ రాయుడు, ఆర్. చెంచల రావు, బెల్లం కొండ విజయలక్ష్మి, టంగుటూరి రాజేష్, ఎ.సుబ్బారావు వ్యవహరించారు. గేయధార అనంతరం కావలి ఆర్డీఓ రఘునందన రావు యాచేంద్రను సత్కరించగా, డిఎస్పీ జి. రవీంద్ర రెడ్డి జ్ఞాపికలను అందజేసారు. కార్యక్రమానికి కావలి సేవాసమితి అధ్యక్షుడు ఎం. చంద్రశేఖర్ రెడ్డి తొలుత స్వాగతం చెప్పగా, టి. మల్లికార్జున రావు చివరన వందన సమర్పణ చేసారు.

## తెగుళ్లమందులు

రెండవ పేజీ కొరవ

ఈ కారు - విలాసవంతమైన కార్లలో ప్రథమ స్థానం ఆక్రమిస్తుందని అంచనా. దీని ధర ఇంకా ప్రకటించలేదు. వారం లోపల తెలుపుతారట.

నాసిక్‌తో పాటు - మద్రాసులోనూ మరొక ఫ్యాక్టరీ ప్రారంభిస్తున్నారు. ఫిస్టారెంజ్ గార్లు ఎక్కడ తయారు చేసారు.

## ముసళ్లపండుగ

2వ పేజీ కొరవ

నోర్చలేరు. ఎగుమతులు పెంచవలె అయిన విదేశీ పెట్టుబడులు ఆకర్షించలేరు. కాని, అందుకు అవసరమైన ప్రాథమిక వసరుల కల్పన జరగడం లేదు. అది జరగాలంటే లక్షల కోట్ల పెట్టుబడి కావాలి. ఆ పెట్టుబడి వచ్చే మార్గం కన్పించడం లేదు. అందువల్లే - ముందున్నది ముసళ్ల పండగేమోనన్పిస్తుంది.



## ఉత్తరక్రియలు

మద్దలూరి వెంకటేశ్వర్లు
Retd. B.D.O.
జననం: 15.1.1930
మరణం: 20.8.1996

మా ఉన్నతికై నిరంతరం శ్రమించి మా బతుకుబాటను తీర్చిదిద్దారు. మీరు లేని లోటు పూడ్చలేనిది. మీ దీవెనలు మాకు వెలుగు రేఖలు. మీ ఆత్మశాంతికై శోకతప్త హృదయాలతో భగవంతుని ప్రార్థిస్తున్నాము.

వారి ఉత్తరక్రియలు 5.9.96 గురువారం, 20/212, మూలపేట, నెల్లూరులోని మా స్వగృహమున జరుగును. కాన తెలియ జేయడమైనది.

ఎం. రాజమ్మ (భార్య)
ఎం. శ్రీనివాసరావు (కుమారుడు) ఎం.ఎన్. భవాని (కోడలు)
పి.వి. రమణమూర్తి (అల్లుడు) పి. వనజాక్షి (కుమార్తె)
మనుమలు, మనుమరాలు
ఎం. కృష్ణతేజ, పి.వి. రాజేష్, పి.వి. రవితేజ, ఎం.ఎన్. శ్రుతి

## ది నెల్లూరు కో–ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు లిమిటెడ్

(నెం.2319, నెల్లూరు), 16/1245, గాంధీనగర్, నెల్లూరు

తేది 20.8.1996

**మహాజనసభ నోటీసు**

ఈ బ్యాంకు యొక్క మహాజన సభ (జనరల్ బాడీ మీటింగ్) 22.9.96 తేది ఆదివారం మధ్యాహ్నం 2 గంటలకు ఈ బ్యాంకు భవనమున జరుగును. కావున బ్యాంకు సభ్యులందరూ సమావేశమునకు హాజరు కావలసినదిగా కోరడమైనది.

చర్చనీయాంశములు

1. పంతాప తీర్మానములు
2. 78వ సంవత్సరపు పరిపాలనా నివేదిక (Administrative Report)ను ఆమోదించుట
3. ది నెల్లూరు జిల్లా కో–ఆపరేటివ్ ఆడిట్ ఆఫీసరు గారిచే జారీ చేయబడిన 1994-95 సంవత్సరపు ఆడిట్ సర్టిఫికేటు పరిశీలించి ఆడిట్ రిపోర్టును ఆమోదించుట.
4. 1997-98 సంవత్సరపు బడ్జెటు అంచనాలు ఆమోదించుట మరియు 1995-96 బడ్జెటు అంచనాలను మించి ఖర్చు కాబడిన మొత్తమును ఆమోదించుట.
5. ఇతర విషయములు

(పాలక వర్గపు అనుమతితో)

పి. సుబ్రహ్మణ్యం — కార్యదర్శి
కె.పి.యస్. అమర్‌నాథ్ — అధ్యక్షులు

## సణుగుడు

4 పేజీ కొరవ

వున్న మార్క్సు కిరీటాదేవీలు కూడా తమంత తాముగా మరింత లోతుకు భూమిలో కూరుక పోతాయి.

"పార్లమెంటరీ భ్రమలు" అనే పదికట్టు పదం కమ్యూనిస్టులకు చాలా ప్రీతిపాత్రమైనది. తమలోని తమకు గిట్టని వారిని విమర్శించ డానికి, పదవుల నుంచి వారిని దూరంగా వుంచేయ డానికి ఆ పార్టీల నాయకులు ఈ వాక్యాన్ని తరచూ వినియోగిస్తుంటారు. కారన సభ, పార్లమెంటరీ వ్యవస్థలనేవి కేవలం విప్లవ మార్గంలో మజిలీలని; తమ సిద్ధాంత, ఆదర్శ లక్ష్య సాధనకు అవి వుపకరించవని; అందువల్ల వాటిపై భ్రమలు పెంచుకో వద్దని హితవు చెప్తుంటారు. కానీ ఇప్పుడు ఆ వ్యామోహమే వారికి పూర్తిగా మైకం క్రమ్మింప జేస్తున్నది.

ఆ మైకం ఫలితమే – ఇప్పటి కామ్రేడ్ల పతనావస్థ. బిస్కట్లు విసిరి పెంపుడు కుక్కలను వెంట త్రిప్పుకున్నట్లు – నాలుగు అసెంబ్లీ సీట్లు, రెండు పార్లమెంట్ సీట్లు ఎరగా చూపి కమ్యూనిస్టులను తన తోకలుగా, తన నీడలుగా మార్చే విద్యను ఎన్టీ రామారావు కనిపెట్టారు. ఈ రాజకీయ లంచం లావాదేవీకి వారు పెట్టుకొన్న ముద్దు పేరు – మిత్రపక్షం! మిత్ర పక్షం అంటే కలిసి మెలిసి, స్నేహ పూర్వక రాజకీయాలు నడపడం; కాని తప్పు చేస్తున్నా సమర్థించడం కాదు. ఈ తేడాను మర్చిపోయారు కామ్రేడ్లు. తప్పును ప్రతిఘటించే చేవ కోల్పోవడమే కాదు – తప్పు చేస్తున్నావని స్నేహపూర్వకంగా మందలించే స్వేచ్ఛనూ త్యాగం చేశారు. తమ పార్టీ సిద్ధాంతాలు, లక్ష్యాలు, విధానాలు, ఆదర్శాలు, ఘనతర చరిత్ర తదితరాలన్నీ గాలికి వదిలేసి ఎన్నికల్లో ఇచ్చే సీట్ల కోసం, పది రూకలు రాలే పైరవీల కోసం ముఖ్యమంత్రి కాళ్ల చుట్టూ పెంపుడు జంతువుల వలెనే గిరికీలు కొడుతున్నారు.

రైతుల నడ్డి విరుస్తూ, వ్యవసాయం భవిష్యత్తును కాలరాస్తూ చంద్ర బాబు పెంచిన విద్యుత్ చార్జీలు, నీటి తీరువాల విషయంలో కమ్యూనిస్టు పార్టీలు మౌన ప్రేక్షక పాత్ర వహిస్తున్నా యంటే – వారి పతనం ఎంతటి క్రింది అంచుల వరకు జారిపోయి వుందో వేరే చెప్పాలా? బీదాబిక్కి జనం కోసం భూపోరాటాలు చేసి ; నిజాం వంటి కర్కశ నిరంకుశ శక్తులతో సమరం నడిపి; రజాకార్ల కసాయి కత్తుల నుంచి జనాన్ని రక్షించను రక్త తర్పణాలు చేసి; ప్రభుత్వాల తప్పుడు విధానాలను నడివీధిలో నిలదీసిన కమ్యూనిస్టు పార్టీలేనా ఇవి అన్పిస్తుంది. ఏమైపోయింది ఆ పోరాట పటిమ; ఎటుపోయింది ఆ సిద్ధాంత నిబద్ధత? ఏ కాలగర్భంలో కలిసిపోయారు ఆనాటి త్యాగమూర్తులు; ఏ చరిత్ర పుటల్లో నిక్షిప్తమై పోయారు? బీదా బిక్కి, జనం పట్ల ప్రేమామరాగాలు? తనలో నలుగురు ఎమ్మెల్యేలు గావడం కోసం తమ పార్టీలనే "బూర్జువా నేతల" కాళ్ల దగ్గర తాకట్టు పెట్టడానికి వీరికి మనస్సెట్లా ఒప్పుతున్నది? తమ పదవుల కోసం ప్రభుత్వం చేసే దుర్మార్గాలను సమర్థించే దైన్యానికి దిగజారడానికి వీరికి నోరెట్లా వస్తున్నది? విప్లవ నినాదాలు చేయవలసిన గళంతో భజన కీర్తనలు పాడటం ఎట్లా సాధ్యమౌ తున్నది?

పువ్వాడ నాగేశ్వర రావు గారిని చూస్తే చాలు – ఈ పతనానికి పరమావధి ఏమిటో చెప్పకుండానే అర్థమై పోతుంది. సిపిఐ శాసన సభాపక్ష నాయకత్వం హోదాను ఆయన చాలా చక్కగా వినియోగించు కున్నారు. ఎమ్మెల్యేల కిచ్చే ప్లాట్లు 14 తన స్వంతం చేసుకొని అమ్ముకొన్నారట ఆయన. వాటి విలువ మూడు కోట్లకు పైమాటే; తన కుమారుడి పేరుతో పాఠ్యపుస్తకాలు అచ్చువేసే కాంట్రాక్టు పొంది మరొక మూడు కోట్లు ఆరగించారు. ఇవి తెలిసిన వ్యవహారాలు; తెలియకుండా ఇంజనీర్ల బదిలీల పేరుతో, పెండింగ్ ఫైళ్ల పరిష్కారం పేరుతో బొక్కిన సొమ్ము ఇంకెన్ని కోట్లు వుంటుందో చచ్చి స్వర్గాన వున్న మార్క్సు మహాశయుడికే తెలియాలి. ఇంతటి దుర్మార్గాలు బయటపడి, కేంద్ర కమిటీ తప్పుపట్టినా ఇంకా ఆయన పదవిలోనే కొనసాగుతున్నారు. అంటే – లంచాలు తినడంలోనే కాదు, ఏ గడ్డి కరిచి అయినా పదవిని కాపాడు కోవాలనే సమకాలీన రాజనీతిజ్ఞతనూ కాంగ్రెస్, తెలుగు దేశం వంటి పార్టీల నుంచి సంపూర్ణంగా వంటబట్టించు కున్నారన్నమాట. ఆరునెలలు సావాసం చేస్తేనే వారు వీరౌతారంటారు; రెండు ఆరేళ్లు తెలుగు దేశంతో మిత్రపక్షంగా సావాసం చేసిన ఆ బడా కామ్రేడ్‌లో ఆ మాత్రం "పరిణతి" రావడం విడ్డూరమేమీ కాదు లెండి!

ఒక్క నాగేశ్వర రావు గారినే ఎందుకనాలి – జక్కా వెంకయ్య గారి వంటి "వారసులు" ఒకరిద్దరు తప్ప సిపిఐ, సిపిఎం ఎమ్మెల్యే లందరిదీ ఇదే దరువు.

మంత్రులు, ముఖ్యమంత్రుల పేషీలలోనే వారి పుణ్యకాలం సరిపోతుంటుంది. ఎప్పుడూ ఏదో ఒక ఫైలు సంకన పెట్టుకొని తిరుగుతూనే వుంటారు. కాంగ్రెస్ ముఖ్యమంత్రుల హయాంలోనూ వీరికిదే వ్యాపారం. అందువల్లే చంద్రబాబుకు జలుబు చేస్తే వీరట్లా తుమ్ము తుంటేది. ముఖ్యమంత్రిని ఒక్కమాట అనవలసి వస్తే వీరికి చెమటలు పడుతున్నాయి. ఆయనెక్కడ అలుగుతాడో, తమ ఫైళ్లెక్కడ తొక్కి పెట్టేస్తాడోనని హడలిపోయి, జ్వరం తెచ్చుకొంటున్నారు. చంద్రబాబు ఆదేశిస్తే – పెంచిన విద్యుత్ చార్జీలు సమంజస మైనవేనని వూరూరా తిరిగి ప్రచారం చేయడానికి వీరు సిద్ధమే! ఇటువంటి అపాదధూతులను ఇంకా కామ్రేడ్లని పిలువ వలసి రావడం – కమ్యూనిజం సిద్ధాంతానికి పట్టిన గ్రహచారం – కాదంటారా?

... డోలేంద్ర

NOTICE
IN THE COURT OF
THE M.A.C.T.
(DISTRICT JUDGE),
AT NIZAMABAD
O.P. No. 167/96

Between:
Redim Karrenna, s/o Bajanna, age 40 years, Occ. Agri. r/o Ananthapeta, Post: Ponkal, Mandal: Momada, Dist: Adilabad ... Petitioner

And
Smt. M. Varalaxmi, w/o Sundhar Rao & Others ... Respondents

To
Smt. M. Varalaxmi, w/o Sundhar Rao, age not known, Occ: Owner of Lorry No. AP-26T 5576, R/o Laxmipuram, Nellore.

That the above petitioner filed OP No. 167/96 for compensation under M.V. Act. It stands posted on 20.9.1996 for your apperance. Notices were sent to you, but returned unserved.

TAKE NOTICE that you are directed to appear before the Hon'ble District Judge at Nizamabad on 20.9.1996 at 10.30 AM either in person or through an advocate. If you fail to appear, the matter will be heard and decided in your absence.

// By the order of the Court //

**Yerram Ganapathi,** MA.,LL.B.,
Advocate for Petitioner
H.No. 10-4-101/7
Sitaram Nagar Colony
Varni Road
NIZAMABAD - 503 001

## దేవగౌడ

1 వ పేజీ కొరవ

ప్రకటించాలన్న ఆలోచన లోలోపల వీరిలో వుంది. ముఖ్య మంత్రికి ఈ పోబడి అందిందనే చెప్పాలి. అందువల్లే ఆయన తన ఇల్లును చక్కబెట్టుకొనే వరకు దేవగౌడ కొంపకు నిప్పు పెట్టే బెదిరింపు లేవీ చేయకూడదన్న నిర్ణయానికి వచ్చారు. అయితే – అన్నం పెట్టిన చేతిని తెగనరికినట్లు, దేవగౌడ తన పట్ల కృతఘ్నతతో వ్యవహరించడం చంద్ర బాబుకు తీవ్ర మనస్తాపం కలిగిస్తుంది. పార్టీలో చీలిక పట్ల ఆయన పెద్దగా భయపడడం లేదు. అల్‌మట్టి వంటి ప్రజా సమస్య పైన తాను దేవగౌడ ప్రభుత్వ పతనాన్ని ప్రేరేపిస్తే – అందుకు సహకరించ కుండా పదవులు కాపాడు కోవాలని చూచే ఎమ్మెల్యేలు, మంత్రులను జనం ఛీత్కరిస్తారని; వారు తమ ఇళ్లకు కూడా తిరిగి రాలేని స్థితిలో, ద్రోహులుగా ముద్ర పడి పోతారని చంద్ర బాబుకు తెలుసు.

అందువల్ల ఆయన చీలిక వార్తలు విని భయపడడం లేదు. కాని వ్యవహారం అంత దూరం రాకుండా అల్‌మట్టి సమస్యను పరిష్కరించడ మెట్లా అన్నదే ఆయనకు బోధపడడం లేదు. దేవగౌడకు వ్యతిరేకంగా ఇతర ఐక్యఫ్రంట్ భాగస్వాములను సమీకరించే యత్నంలో నిమగ్నులై వున్నారాయనిప్పుడు.

## అల్‌మట్టి

1వ పేజీ కొరవ

కాని, పి. జనార్దన రెడ్డికి ఎమ్పీల నుంచి తగిన సహకారం లభించడం లేదు. ఆంధ్ర నుంచి ఇరవై మంది ఎమ్పీలున్నారు. వీరందరూ కలిసికట్టుగా వ్యవహరించి, దేవగౌడపై సమరం చేస్తే లోక్‌సభను స్తంభింప చేయవచ్చు. కాని ఇప్పటి వరకు ఆ ప్రయత్నం జరగలేదు. తెలుగు దేశం సభ్యులు చొరవ చూపినప్పుడూ వీరు మౌనంగా వుండిపోయారు. ఎమ్పీలు తమ ధోరణి మార్చుకోకుంటే రాష్ట్రంలో కాంగ్రెస్ పట్లనే రైతులలో విశ్వాసం సన్నగిల్ల నుంది.

నోటీసు
రెండవ అదనపు జిల్లా
కోర్టు, నెల్లూరు
O.P. No.297/96

1. కాపూరి రమణమ్మ
2. కాపూరి శ్రీనివాసులు రెడ్డి
... పిటీషనర్లు

Vs.

1. Y. రమణారెడ్డి
2. యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్సు కంపెనీ, నెల్లూరు
... రెస్పాండెంట్లు

To:
Y. రమణా రెడ్డి
3/80, లక్ష్మీపురం నెల్లూరు - 2

పై నంబరున వారికి క్లైమ్ నోటీసు జారీ చేయు నిమిత్తము పై కోర్టు వారు తేది 2.9.96 నాడు వాయిదా వేసి యున్నారు. కావున తమరు పై తేదిన ఉదయం 10.30 గంటలకు స్వయంగా గాని లాయరు గారి ద్వారా గాని తమ ఆక్షేపణలు తెలుపుకో వలసినది. లేనిచో కేసు మీ పరోక్షమున తీర్మానించబడును.

కె. రఘునాథరెడ్డి
అడ్వకేటు, జేమ్సుగార్డెన్, నెల్లూరు
పిటీషనరు తరఫున అడ్వకేటు



# శ్రద్ధాంజలి

మాకు పూజ్యులు, ఆదర్శవంతులు అయిన

## శ్రీ పోలంరెడ్డి ఈశ్వరరెడ్డి గారు

(ఈదూరు)

మద్రాసులో 20-8-96తేది స్వర్గస్థులైనందుకు చింతిస్తూ వారి ఆత్మకు శాంతి చేకూర్చ వలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

తిరుమూరు చంద్రారెడ్డి
(మింంజూరు) రెడ్డిపాళెం

మాచిరెడ్డి బాబురెడ్డి
మామిడిపూడి

# రైతుల్లో చైతన్యం

కృష్ణ ఉభయ గోదావరి జిల్లాలలో ఉధృతమౌతున్న రైతు ఉద్యమం ఎంతో ఆనందం కలిగిస్తున్నది. విద్యుత్ ఛార్జీలు, నీటి తీరువాల పెంపుపట్ల రైతులు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు; ప్రభుత్వాన్ని, నేతలను నిర్భయంగా నిలదీస్తున్నారు. ఎంతటి శుభ పరిణామం ఇది?

ఆచార్య రంగా వంటి రైతు పోరాటయోధులు ఈనాడు బ్రతికి వుంటే ఎంతగా సంతోషించి వుండేవారో!

రైతులలో ఈపాటి చైతన్యం ఇదే ప్రథమం. ఆంధ్ర దేశంలో ఏ రైతు ఉద్యమమూ ఇంత స్వచ్ఛందంగా రైతులను ఆకర్షించలేదు; ఇంతటి వీరావేశంతో వారు వీధుల్లోకి రాలేదు. పెనుభారం పైన మోపినా, మౌనంగా భరించడం తప్ప, లోలోపల బాధపడడం తప్ప బహిరంగంగా తమ ఆవేదన వ్యక్తం చేసుకోలేని మూగజీవుల వంటి రైతులలో చైతన్యం తెచ్చినందుకు ముఖ్యమంత్రి చంద్రబాబును అభినందించాలి. రైతు నోరు లేనివాడనే చులకనతోనే చంద్రబాబు పన్నులంతగా పెంచారు. దాని ఫలితంగా వ్యవసాయం చేయలేమనే భయంతో, బాధతో రైతులు ప్రభుత్వంపై తిరగబడుతున్నారు. దీన్ని చైతన్యం అనడం కంటె - చావుబ్రతుకుల పోరాటం అనడం సమంజసం. గదిలో పెట్టి చావబాదితే పిల్లి తిరగబడినట్లు చంద్రబాబు పన్నుల మోతను రైతులు ప్రతిఘటిస్తున్నారు.

ఆ మూడు జిల్లాలలో గ్రామ గ్రామంలో నిరసన కార్యక్రమాలు జరుగు తున్నాయి. నిర్మొగమాటంగా, నిర్భయంగా అధికారుల వద్దకు, మంత్రుల వద్దకు వెళ్లి నిలదీస్తున్నారు. విద్యుత్ సబ్‌స్టేషన్ల వద్ద ధర్నాలు, రోడ్డు బంద్‌లు జరుగు తున్నాయి. ఇప్పటి వరకు ఈ ఉద్యమంలో ఏ రాజకీయ పార్టీకి ప్రత్యక్ష ప్రమేయం లేకపోవడం విశేషం; ఏ పెద్ద నాయకుడూ ముందు నిలబడక పోయినా, రైతులే సంఘటితమై, రాజకీయాతీతంగా ముందుకు దూసుకు వెళ్లిపోతున్నారు. ఇదీ ఒక శుభ పరిణామమే. రాజకీయాలు ప్రవేశిస్తే ఉద్యమ స్వరూప స్వభావాలు మారిపోతాయి. తమ వ్యక్తిగత ప్రయోజనాలు నెరవేరగానే ఉద్యమాన్ని నీరు గార్చించి వేయడంలో సిద్ధహస్తులు రాజకీయ వాదులు. జై ఆంధ్ర వంటి సంచలనాత్మక ఉద్యమాలే నిష్ఫలమై పోయాయి వీరివల్ల! ఆ దృష్టితో చూసినప్పుడు రాజకీయాతీతంగా ఉద్యమం నడపాలని ఉభయ గోదావరి జిల్లాల రైతులు తీసుకొన్న నిర్ణయం అభినందనీయ మైనది.

ఏదో ఒక రూపంలో ప్రభుత్వం మెడలు వంచి, పెంచిన పన్నులు తగ్గించ కుంటె ఆంధ్ర దేశంలో వ్యవసాయం చేయడం వ్యర్థమౌ తుంది. కష్టపడి పండించిన ధాన్యమంతా ప్రభుత్వ బొక్కసానికి తరలించి, రైతులు ఆకలి చావులకు గురికావలసి వస్తుంది. ప్రపంచంలో ఏ దేశంలో కూడా వ్యవసాయంపై ఇంతటి బరువు వేయడం జరిగి వుండదు. విత్తనాలు, ఎరువులు, కూలీలు, తెగుళ్ల మందులు, ట్రాక్టర్ బాడుగలు, డీసల్ ధరలు వంటివన్నీ గత పదేళ్లలో రెండు నుంచి నాలుగు రెట్లు పెరిగి పోయాయి. వడ్ల ధర మాత్రం రెట్టింపు కూడా కాలేదు. ఈ ఖర్చులన్నీ లెక్కిస్తే రైతుకు పంట విలువలో పదిశాతం కూడా మిగులు వుండడం లేదు. ఈ పరిస్థితులలో అదనపు విద్యుత్ ఛార్జీలు, నీటి తీరువాలను అప్పుచేసి కట్టవలసిందే. ఈ వాస్తవాన్ని పరిగణనకు తీసుకోకుండా, ఎప్పుడెప్పుడో తాము చేసిన తప్పులకు దివాలా తీసిన విద్యుత్ బోర్డును రైతుల రక్తమాంసాలు పిండి నింపాలనుకోవడం దారుణమైన నేరం. అందుకే ప్రభుత్వం నిర్బంధిస్తే వ్యవసాయం పాడుపెట్టి వూరకుండ వలసిన దుస్థితి ఏర్పడుతుంది రైతుకు.

రైతు శక్తిని తక్కువగా అంచనా వేసి నింపాదిగా కూర్చుని వున్నాడు ముఖ్యమంత్రి. అలుగుటయే ఎరుగని రైతన్న అలిగిన నాడు ప్రభుత్వ పునాదులు కదిలి పోతాయన్న నిజం ఆయనకు బోధపడడం లేదు. ఇప్పటికైనా వాస్తవం గ్రహించి, తన తప్పును సవరించుకో గల్గితే ఆయన పరిపాలన సక్రమంగా కొనసాగుతుంది; లేకుంటె వినాశనమే.

రైతులు తమ ఉద్యమాన్ని శాంతియుతంగా జరిపించడం అవసరం. ఆనాడు బ్రిటీషు దొరల మెడలు వంచడానికి గాంధీ మహాత్ముడు సూచించిన సహాయ నిరాకరణ ఈనాటి పరిస్థితులకు ఎంతో అనువైన ఉద్యమ సాధనం. గ్రామగ్రామంలో రైతులు సమైక్యమై అన్ని రకాల పన్నులూ కట్టడం నిలిపి వేస్తే ప్రభుత్వం దిగిరాక తప్పదు.

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సరంలో దేశానికి శుభ కానుక అన్నట్లుగా రైతులలో వెల్లివిరుస్తున్న చైతన్యం, సంఘీభావం, ఉద్యమ స్ఫూర్తి మరింతగా పరిఢవిల్లాలని ఆకాంక్షిస్తున్నాము.

జమీన్‌రైతు

జమీన్‌రైతు

23-8-46

పేజీలు:6 వెల:0-1-6

**పనిలేని వారుండరాదు**

పరాన్న భుక్కుల కంటె లోక కంటకులు మరియొక రుండరు. సంఘానికి వారు బరువు చేటు. సోమరులగు ధనికులతోను, పనిలేక కడుపుకాలి బాధపడు పరిశ్రామికుల తోను దేశము దుస్థితి లోనున్నది. స్వరాజ్య స్థాపన జరిగిన పిదప దేశమున పనిలేని వారుండరాదు. అభివృద్ధి పొందుట కవకాశము కలవారందరికీ సమానముగా కల్పించబడును.... నెహ్రూ

**అభ్యుదయ**

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు ఈ క్రింది ప్రకటన చేస్తున్నారు.

అభ్యుదయ రచయితల సంఘం తరఫున ఒక సాహిత్య మాసపత్రికను నడపాలని ఇప్పటికి నాలుగు సంవత్సరముల నుంచి కృషి చేస్తున్నాం. నేటికి కాంగ్రెసు ప్రభుత్వం రావడంతో మా కృషి ఫలించింది. అభ్యుదయ అనే సచిత్ర సాహిత్య పత్రిక ప్రచురించడానికి ప్రభుత్వం అనుమతించింది. ఇందుకు తోడ్పడిన ఆంధ్ర ప్రముఖులకూ, కాంగ్రెసు మంత్రులకూ మా అభివందనాలు తెలుపు చున్నాము.

**తిరుపతి విశ్వవిద్యాలయం**

శ్రీ వెంకటేశ్వర ధన సహాయంతో తిరుపతిలో ఒక విశ్వకళా పరిషత్తును స్థాపించ దలచుకొనుట ఎంతయు ముదావహమైన సంగంతి. ఇది - ఇతర యూనివర్శిటీల వలె, కడుపు చేతపట్టుకొని తిరిగే గుమస్తాల సైన్యాన్ని ఉత్పత్తి చేయగూడదని కోరుతాము.

హిందూ సంస్కృతి, హిందూత్వములను వృద్ధి పరిచే విద్యావిధానమే యిందుండ

50 ఏళ్ళ క్రితం ఈ వారం

వలయును. మత చారిత్రక వాఙ్మయములలో ఎంతో పరిశోధన గావింపవలసి యున్నది. ఇది "హిందువు" అయినను యితర మతములవారు, జాతులవారు దీని నీడను విజ్ఞానమును గ్రోలను అవకాశము లుండవలెను.

ఈ దేవునికి అన్ని రాష్ట్రాలవారు కొండె కానులు చెల్లించు కొన్నను, దేశం తెలుగు - దేవుడు గూడ తెలుగు వాడే కాబట్టి పరిషత్తు గూడ తెలుగుదై తన వైలక్షణ్యమును

కొరవ 13 పేజీలో

# రైతులకు ఆత్మహత్యలే శరణ్యమయ్యేట్లుంది

రాష్ట్ర ప్రభుత్వం తన ఇష్టాను సారంగా పన్నులు పెంచి ప్రజలను వేధించుక తింటున్నది. పండించిన పంటకు గిట్టు బాటుధర లేక ఇప్పటికే రైతులు అల్లాడి పోతున్నారు. రైతులు ఇంట్లోని నగలను బ్యాంకుల్లో తాకట్టు పెట్టి తిరిగి తీసుకోలేక పోతున్నారు. ప్రస్తుతం పెంచిన నీటి తీరువా, విద్యుత్ ఛార్జీలూ చెల్లించవలసి వస్తే రైతులకు ఆత్మహత్యలుతప్పవేమో! రైతు సొమ్ము నిత్యం తింటూ, విలాస జీవితాలు గడిపే విద్యుత్ శాఖ వుద్యోగులు రైతును దొంగలుగా చిత్రీకరిస్తూ ప్రకటనలు చేయడం దారుణం. రైతు పడే బాధను ఏ రాజకీయ పార్టీ సీరియస్‌గా తీసుకోవడం లేదు. పత్రికా ప్రకటనల వరకే సరిపుచ్చు కొంటున్నారు. ఉద్యమానికి తగిన నాయకుడు లేక జిల్లా రైతులు స్తబ్బుగా వున్నారు. ఎవరో ఒకరు నాయకత్వం వహించి, రైతు ఆవేశం కట్టలు తెగితే ప్రభుత్వం బాధ్యత వహించక తప్పదు.

కోడూరు వి.మాధవరావు

**రైతుల ధోరణి మారాలి**

తనకు ఎంత అన్యాయం జరిగినా, ప్రభుత్వాలు నిలువునా మోసం చేస్తున్నా, ప్రకృతి పగబట్టి నాశనం చేసినా గెనాల చుట్టూ తిరుగుతూ రైతు తన బ్రతుకింతేనని సరిపెట్టు కొంటున్నారు. రైతుల్లో సంఘటిత మయ్యే తత్వం లేనందువల్లనే ప్రతిఒక్కరూ రైతును సులభంగా మోసం చేస్తుంటారు. రైతులు ఎవరో ఒక నాయకుడికి ఎప్పుడూ బానసటగా నిలవరు.

**జనవాణి**

1964లో 17వ రాజ్యాంగ సవరణ ద్వారా భూమిపై రైతు హక్కును తొలగించి వారిని కూలీలుగా చేసే చట్టాన్ని కేంద్ర ప్రభుత్వం చేయబోయింది. దాన్ని స్వర్గీయ ఎన్.జి.రంగా గారు ఎదుర్కోవడంతో చట్టాన్ని చేయలేక పోయింది. కాని అటు వంటి నాయకుడికి రైతులు అండగా నిలబడ లేకపోయారు. తెలుగుదేశం ప్రభుత్వం నీటి తీరువా, విద్యుత్ ఛార్జీలు పెంచి రైతుల నడ్డి విరగగొట్టింది. దీనిపై పలువురు రాజకీయ పార్టీల నాయకులు జిల్లా కేంద్రంలో నిరసిస్తూ ప్రదర్శనలు చేశారు. కాని ఇంత వరకు నష్టపోయే రైతులు నివశించే గ్రామీణ ప్రాంతం నుంచి ఒక్క ప్రదర్శన కూడా జరగక పోవడం ఏమిటి? ఉద్యమాలకు పుట్టినిల్లైన నెల్లూరు రైతులు ఇంకా నిద్రావస్థలో వుంటే ఎట్లా?

చెర్లోపాళెం వి.నిరంజన్

**ఆక్రమణలపాలైన నాడార్ తోట!**

వి.ఆర్.కళాశాల గడియారం స్తంభం చుట్టూ ఆక్రమణలు ఎక్కువై పోయాయి. పక్కా నిర్మాణాలూ జరిగిపోయాయి. పూర్వం గడియార స్తంభం చుట్టూ ఎంతో స్థలం ఖాళీగా వుండేది. అక్కడ వుండే గుర్రం బొమ్మ ప్రత్యేకం ఆకర్షణగా కన్పించేది. దీన్ని నాడార్ తోటగా పిలిచేవారు. ప్రస్తుతం ఆ ఆనవాళ్లే లేకుండా పోయాయి. అందులో దేవాలయం, బంకులు, సైకిల్ షాపులు వెలిశాయి. మునిసిపాలిటీలో టౌన్ ప్లానింగ్ ఆఫీసర్ వున్నా టౌన్‌లో ఆక్రమణలను ఆయన పట్టించుకోరు. నాడార్ తోట ఆక్రమణలా టౌన్‌లో

కొరవ 13 పేజీలో

# మునిసిపల్ మీటింగ్‌లకంటే చేపల మార్కెటే నయం!

మునిసిపల్ సమావేశాల్లో కొందరు సభ్యులు వాడుతున్న పదజాలం చేపల మార్కెట్ స్థాయి కంటే దిగ జారిపోయింది. పని గట్టుకొని కొందరు సభ్యులు సమావేశాల్లో ఉద్రిక్త వాతావరణం సృష్టిస్తుండడంతో ప్రతి సమావేశమూ ప్రక్కదారి పట్టి పోతున్నది. ప్రజా సమస్యలపై చర్చించను వచ్చిన ఒకరిద్దరు సభ్యులకు మాట్లాడే అవకాశమే చిక్కడం లేదు. 26తేది జరిగిన మునిసిపల్ సమావేశంలో ఇద్దరు సభ్యులు పరమ రోతగా తమ జన్మ వృత్తాంతాన్ని వివరించుకొంటూ వికృతమైన భాషలో మాట్లాడనారంభించేసరికి మహిళా కౌన్సిలర్లు చెవులు మూసుకొని, సిగ్గుతో చితికి పోవాల్సి వచ్చింది. ఆ కౌన్సిలర్ల బరితెగించిన భాషపట్ల కౌన్సిలర్ పరోజనమ్మ నిరసన తెలియ జేశారు. స్వతంత్ర సభ్యుడు సందాని బాషా ఏదో విషయాన్ని మనసులో పెట్టుకొని మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానందరెడ్డిని అనరాని మాటలన్నారు. ఒకానొక దశలో సహనం చచ్చిన ఛైర్మన్ సభ్యుడ్ని ఉద్దేశిస్తూ 'కంట్రోల్ యువర్ సెల్ఫ్', నిన్ను బయటకు పంపాల్సి వస్తుందని హెచ్చరించేంత పరిస్థితి వచ్చింది.

నిధులు విడుదల కాకుండానే ఎమ్మెల్యే గ్రాంటుకు మునిసిపల్ గ్రాంట్ కలిపి పనులు చేయడంపైన, టౌన్ ప్లానింగ్ అధికారి పనితీరుపైన పలువురు సభ్యులు మండి పడ్డారు. ఎసి కూరగాయల మార్కెట్‌లోని షాపు రూములకు పాత లీజును డిసెంబరు వరకు పొడిగించేందుకు సభ్యులు సమావేశంలో ఆమోదం తెలిపారు.

> **కౌన్సిలర్ల కుసంస్కారంతో నెల్లూరు పరువే పెన్నలో కలుస్తోంది!**

సమావేశం మొదలు కాగానే కౌన్సిలర్ సందాని బాషా పరస్పర ఆరోపణలకు అంకురార్పణ చేశారు. తాను ఎప్పుడూ కూర్చునే సీటు ఆ మరో కౌన్సిలర్ ఊటుకూరు లక్ష్మయ్య దురాక్రమణ చేశారని నానాయాగి చేసారాయన. పర్మినెంట్ సీటింగ్ అంటూ సభలో లేకపోవడం వల్ల ఎక్కడైనా తాను కూర్చుంటానని లక్ష్మయ్య భీష్మించు కొన్నారు. ఈ గొడవలో ఛైర్మన్ జోక్యం చేసికొని, వచ్చే సమావేశం నుంచి సభ్యులకు సీటింగ్ ఏర్పాట్లు చేయమని అధికారులను కోరారు.

ఇంతలో సిపిఎం పక్షనాయకుడు మాదాల వెంకటేశ్వర్లు కల్పించుకొని గత సమావేశంలో బడ్జెట్,ఆదాయ, వ్యయాలకు సంబంధించి కౌన్సిల్ చేసిన తీర్మానాన్ని ఛైర్మన్ మినిట్స్‌లో మార్చి వ్రాసారని ఆరోపించారు. ఈ అంశం మీద సందాని బాషా మాటాడిన కొన్ని మాటలను ఛైర్మన్ రికార్డుల నుంచి తొలగిస్తున్నట్లు చెప్పారు. పలువురు సభ్యుల సలహా మేరకు మళ్లీ వ్రాసిన తీర్మానాన్ని కౌన్సిల్ ముందుంచడంతో గొడవ సద్దు మణిగింది.

మునిసిపాలిటిలో అభివృద్ధి పనులు మంత్రి, ఛైర్మన్, లేదా ఎవరైనా ఎమ్మెల్యే రెకమెండేషన్ వుంటేనే జరుగుతున్నాయని సిపిఎం సభ్యురాలు ఉషారాణి ఆరోపించారు. నెల్లూరు ఎమ్మెల్యే గ్రాంటుకు నిధులు విడుదల కాకుండానే మునిసిపాలిటి మ్యాచింగ్ గ్రాంటు ఇవ్వడమేమిటని ప్రశ్నించారామె. మునిసిపాలిటి నిధులు ఎమ్మె. ఎమ్మెల్యేల మ్యాచింగ్ గ్రాంటులకే సరిపోతే తమ వార్డుల అభివృద్ధి ఎలా జరుగు తుందని

కొరవ 13 పేజీలో



సింహపురి సాహిత్య సాంస్కృతిక అకాడమి నిర్వహించిన కవితల పోటీల్లో విజేతలను ప్రకటిస్తున్న పాయసం సుబ్రహ్మణ్యం. ప్రక్కన పొకాల వెంకటకృష్ణయ్య

## విషణగుడు

* చంద్రబాబుకు జలుబు చేస్తే ఆంధ్ర కామ్రేడ్లకు తుమ్ములొస్తున్నాయి

రష్యాలో వర్షం వస్తే ఇండియాలో గొడుగులు వేసుకొని తిరుగుతారని పూర్వం కమ్యూనిస్టులను గేలి చేసివారు; ఇప్పుడు చంద్రబాబుకు జలుబు చేస్తే ఆంధ్ర కామ్రేడ్స్‌కు తుమ్ములు వస్తున్నాయి. అయితే ఇది ఎగతాళి మాట కాదు; నిజం. రాముడు భీముడు సినిమాలో రాజప్రాసాదంలో రాముడ్ని కొరడాతో కొడితే, అడవిలో వున్న భీముడి వంటిపై వాతలు తేలినట్లుంది – చంద్రబాబు, కామ్రేడ్ల కలయి[ిక] ఇప్పుడు. ఆయన్ని ఒక్క మాటంటే వీరు పడలేక పోతున్నారు. ప్రభుత్వాన్ని సమర్థించడమనే ఏకైక లక్ష్యంతో; చంద్రబాబు వెన్నంటి వుండాలనే ఏకైక విధానంతో; తెలుగు దేశపు మిత్ర పక్షమన్పించు కోవాలనే ఏకైక సిద్ధాంతంతో ఆంధ్ర కామ్రేడ్లు వ్యవహరిస్తున్న తీరును చూసే మహద్భాగ్యం కల్గితే – సమాధిలో

కొరవ 8 పేజీలో

# యానాదిరెడ్డి అనారోగ్యంతో కావలి టౌన్ బోసిపోయింది!

కావలిలో కాంగ్రెస్‌కు అస్థిత్వాలైన ఎమ్మెల్యే శ్రీ కలికి యానాదిరెడ్డి అనారోగ్యంతో మద్రాసు ఆసుపత్రిలో చేరడంతో కావలి నాయకులకు కాలుచేయి ఆడటం లేదు. కలికి కావలిలో ఉంటే చిన్న, చితక

### అధికారులు మాత్రం హ్యాపీ!

నాయకులు ఎంతో హడావుడిగా వుంటారు. రాజీవ్‌గాంధీ జన్మదినానికి రాజీవ్ విగ్రహం, టి.వి.స్టేషన్, రైల్వే బ్రిడ్జీలను ప్రారంభించాలను కొన్నారాయన. కాని అనుకోని విధంగా మద్రాసు నుంచి రైల్లో వస్తూ అస్వస్థులు కావడంతో నెలరోజుల పాటు మద్రాసు ఆసుపత్రిలో వుండాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఎమ్మెల్యే తాకిడి లేకపోవడంతో అధికారులు మాత్రం హాయిగా ఊపిరి పీల్చుకొంటున్నారు. ఆయన అభిమానులు ఎప్పుడు 'కలికి' కావలి తిరిగి వస్తారా అని ఎదురు చూస్తున్నారు.

## ఋణాల మంజూరులో కావలి బ్యాంక్ ఫస్టు

కావలి పినాకిని గ్రామీణ బ్యాంకు ఇప్పటి వరకు 72 పొదుపులక్ష్మి గ్రూపులకు ఋణాలను మంజూరు చేసి రాష్ట్రంలో ప్రథమ స్థానంలో ఉన్నట్లు బ్యాంకి ఛైర్మన్ ఎస్.మోహనకృష్ణ చెప్పారు. 6 పొదుపులక్ష్మి గ్రూపులకు 2లక్షల 7వేల రూపాయలను ఛైర్మన్ 19తేది పంపిణీ చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ వేగూరు, తుమ్మలపెంట, కావలి శాఖల ద్వారా అత్యధిక ఋణాలు మంజూరు చేసినట్లు వివరించారు. వేటపాలెంలో నాబార్డు ఆర్థిక సహాయంతో గ్రామీణాభివృద్ధి శిక్షణా సంస్థ ఏర్పాటు చేస్తున్నారట. జిల్లాలో మహిళలు 10కోట్లు పొదుపు చేశారని ఛైర్మన్ చెప్పారు. కార్యక్రమంలో బ్యాంకు క్రెడిట్ మేనేజర్ ఎ.సి.శేషగిరిరావు, జనరల్ మేనేజర్ వై.గౌరీశంకర్, పొదుపులక్ష్మి ప్రత్యేక అధికారిణి శ్రీమతి కుసుమ కుమారి పాల్గొన్నారు.

వరకు కనీసం లక్షా 30వేల రూపాయలు వసూలు చేసినట్లు తెలిసింది. వీటికి సంస్థ సెక్రటరీ ద్వారా కాక, ప్రెసిడెంటు సంతకంతో రశీదులు యిస్తున్నారు. వసూలైన ఈ సొమ్ము యింత వరకు కనీసం సంస్థ ఆడిట్ పుస్తకాలలో కూడా నమోదు కాలేదు.

ఈ పొదుపు పథకం ప్రతి జాతీయ, గ్రామీణ బ్యాంకులు అమలు పరుస్తున్నా, వసూలు చేసే వ్యక్తి బ్యాంకుకు లక్ష రూపాయలు ష్యూరిటీ చూపించాలి. మరో 25వేల రూపాయలు డిపాజిట్ చేసి, బ్యాంకులో పనిచేసే ఒక ఉద్యోగి హామీ వున్నప్పుడు మాత్రమే ఆ వ్యక్తికి

కొరవ 7 పేజీలో

# ఏడెకరాల రైతుకు పేదలకిచ్చే సబ్సిడీ!

నెల్లూరు రూరల్ మండలం పొట్టెపాళెం గ్రామంలో డి.ఆర్.డి.ఎ సంస్థ వారు ఋణాలివ్వ సంకల్పించి గ్రామసభను నిర్వహించారు. 170 మందికిపైగా కుటుంబాల్లోని వ్యక్తులు ఋణాల కోసం దరఖాస్తులు సమర్పించారు. గ్రామసభ తంతు నిర్వహించిన అధికారులు గ్రామంలో ఏడేసి ఎకరాల పైబడివున్న రైతులకు కూడా ఋణాలిస్తున్నట్లు ప్రకటించే సరికి మిగతా ప్రజలు ఆశ్చర్యపోయారు. తమకు ఏదో ఒక ఆసరా లభిస్తుందని భావించిన నిరుద్యోగులు ఎంపిక చేసిన అధికారుల తీరును నిరసిస్తున్నారు. వాస్తవ లబ్ధిదారులకు ఋణాలు ఇప్పించే విషయంలో డి.ఆర్.డి.ఎ ప్రాజెక్ట్ డైరెక్టర్ తగిన విచారణ జరిపి న్యాయం చేకూర్చాలని పొట్టెపాళెం ప్రజలు కోరుతున్నారు.

## జిల్లావార్తలు

### కావలి సొసైటీలో లక్షరూపాయలు స్వాహా!

కావలి సొసైటీలో బయటి వ్యక్తుల ప్రమేయం ఎక్కువ కావడంతో కావలి సొసైటీ అక్రమాలకు నిలయంగా తయారౌతుంది.

కావలి అర్బన్ బ్యాంకు భవనంలో నెలకు 500 రూపాయల అద్దెకు నడుస్తున్న కావలి సొసైటీ, అర్బన్ బ్యాంకు అధికారుల అనుమతి లేకుండానే, మిద్దెపై గదుల నిర్మాణం చేపట్టడంతో అక్రమ పనులకు శ్రీకారం చుట్టింది. బ్యాంక్ భవనంలో నిర్మాణం జరగాలంటే ముందుగా పర్సన్ ఇన్‌ఛార్జి, ప్రభుత్వ ఇంజనీరు, చివరిగా డిప్యూటీ రిజిష్ట్రార్ అనుమతి ఇవ్వాల్సి వుండగా, యివేమీ పాటించక గదుల నిర్మాణం చేపట్టారు. దీనిపై వివరణ అడిగిన అర్బన్ బ్యాంకు అధికారులకు యింతవరకు సమాధానం యివ్వలేదని తెలిసింది.

తమ సంస్థ 'బ్యాంకు' కాదని, సొసైటీ అని తెలిసికూడా పొదుపు పథకం ప్రవేశపెట్టి గత 7 నెలల నుండి డైలీ డిపాజిట్ పథకం ద్వారా యిప్పటి

## ప్రిన్సిపల్ డిస్ట్రిక్టు మున్సిఫ్‌గారి కోర్టు, కందుకూరు

E.P. No. 74/92; O.S. No. 415/86

స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా, ఎ.డి.బి., కొండపి, తరపున బ్రాంచ్ మేనేజరు ... డిక్రీ హోల్డర్ / వాది

Vs.

1. అరికట్ల వెంకటేశ్వర్లు, 2. అరికట్ల రత్తమ్మ ... జె.డి.ఆర్స్/ప్రతివాదులు

### వేలం ప్రకటన

వాది / డిక్రీహోల్డర్‌కు చెందవలసిన పై డిక్రీ బాకీకి గాను, జె.డి.ఆర్స్ స్వాధీన మందుండు ఈ క్రింది షెడ్యూలు దాఖలా భూములను కోర్టువారు 17.9.96 తేది పగలు గం.10.30 ని.ల తర్వాత బహిరంగ వేలం వేయబడును. కావున వేలం పాటలో పాల్గొనదలచిన వారు పాల్గొనవచ్చును.

### షెడ్యూలు

ప్రకాశం జిల్లా రిజిస్ట్రేషన్, సింగరాయకొండ సబ్ రిజిస్ట్రేషన్, కొండపి గడియారం వారి కంద్రిక మరియు కొండపి గ్రామాలలోని ఆస్తులు:-

| వ.నెం. | పట్టా నెం. | సర్వే నెం. | పూర్తి విస్తీర్ణం యం. సెం. | అనుభవం యం. సెం. | గ్రామం |
|---|---|---|---|---|---|
| 1. | 286 | 128/3 | 2-22 | 2-22 | కె.జి.కంద్రిక పూరా |
| 2. | 285 | 13/4 | | 2-14 | -do- |
| హద్దులు: తూ. బి.వి. క్రిష్టారావు భూమి, ద. కె. తిరుపతి స్వామి భూమి, ప. ఎ. వెంకటేశ్వర్లు భూమి, ఉ. ఆర్. వెంకట సుబ్బయ్య భూమి. 1 మరియు 2 అయిటములు డి.హెచ్.ఆర్. విలువ రూ.7000/-, అమీనా విలువ రూ. 17,000/- | | | | | |
| 3. | 288 | 144/5 | | 2-80 | -do- |
| హద్దులు: తూ. ఎ.వి. రమణయ్య భూమి, ద. ఆర్. రమణయ్య భూమి, ప. ఎ. రత్తమ్మ భూమి, ఉ. డొంక. డి.హెచ్.ఆర్. విలువ రూ.5,000/-; అమీనా విలువ రూ.11,000/- | | | | | |
| 4. | గ్రామనత్తం | 115&117/1 | | 0-04 | కొండపి దార్బి స్థలం |
| హద్దులు: తూ. రోడ్డు, ద. జి. రమణయ్య భూమి, ప. జి. కోట్లింగయ్య భూమి, ఉ. ఎ. వెంకటరమణయ్య భూమి. డి.హెచ్.ఆర్. విలువ రూ.200/-; అమీనా విలువ రూ.400/- | | | | | |

వేలం వాయిదా తేది 17.9.1996,

తదుపరి విచారణ తేది 20.9.1996

ఆర్. చెంచురామయ్య, అడ్వొకేట్, కందుకూరు

## సబార్డినేట్ జడ్జిగారి కోర్టు, కందుకూరు

E.P. No. 76/93; O.S. No. 59/87

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఎ.డి.బి., కొండపి, తరపున బ్రాంచ్ మేనేజర్ – డిక్రీ హోల్డర్ / వాది

Vs.

1. నల్లూరి వెంకయ్య (Died) (ప్రతివాది)
2. నల్లూరి సామ్రాజ్యం, 3. నల్లూరి చెంచయ్య ... జడ్జిమెంట్ డెటార్లు

### వేలం ప్రకటన

వాది / డిక్రీ హోల్డరుకు చెందవలసిన పై డిక్రీ బాకీకి గాను జె.డి.ఆర్స్. స్వాధీనమందుండు ఈ క్రింది షెడ్యూలు దాఖలా భూములను కోర్టువారి ఎదుట 10-9-1996 తేదిన పగలు 10.30 గం.ల తర్వాత బహిరంగ వేలము జరుగును. కావున వేలం పాటలో పాల్గొన దలచిన వారు పాల్గొనవచ్చును.

### షెడ్యూలు

ప్రకాశం డిస్ట్రిక్టు రిజిస్ట్రేషన్, సింగరాయ కొండ సబ్ రిజిస్ట్రేషన్, కొండపి మజరా, కట్టావారిపాలెం గ్రాంలోని భూములు:-

| వ.నెం. | పట్టా నెం. | సర్వే నెం. | పూర్తి విస్తీర్ణం యం. సెం. | అనుభవం యం. సెం. | హెక్టార్లు | మాగాణి/ మెట్ట |
|---|---|---|---|---|---|---|
| 1. | 208 | 41/2 | 0-75 | 0-16 | 0.065 | మాగాణి |
| హద్దులు: తూ. తన్నీరు చంద్రయ్య భూమి, ద. అంగలకుర్తి సుబ్బయ్య భూమి, ప. రావెళ్ల కోటయ్య భూమి, ఉ. రావెళ్ల చెంచయ్య, S/o రోశయ్య భూమి, డి.హెచ్.ఆర్. విలువ రూ.500/-; అమీనా విలువ రూ.6,000/- | | | | | | |
| 2. | 97 | 90/1 | 454 | 0-15 | 0.060 | మాగాణి |
| హద్దులు: తూ. రావెళ్ల వెంకటేశ్వర్లు భూమి, ద. & ప. రావెళ్ల చిన కోటయ్య భూమి, ఉ. రావెళ్ల వెంకటేశ్వర్లు, S/o పున్నయ్య భూమి. డి.హెచ్.ఆర్. విలువ రూ.450/-; అమీనా విలువ రూ.5,000/- | | | | | | |
| 3. | 386 | 144 | 1-00 | 0-23 1/2 | 0.095 | మెట్ట |
| హద్దులు: తూ. రావెళ్ల చిన కోటయ్య భూమి, ద. రావెళ్ల పెద కోటయ్య భూమి, ప. అన్నంరాజు సీతారామయ్య భూమి, ఉ. కొండపి శ్రీరాములు వగైరాల భూమి. డి.హెచ్.ఆర్. విలువ రూ.200/-; అమీనా విలువ రూ.6,000/- | | | | | | |
| 4. | 363 | 323 | 10-34 | 1-78 | 0.721 | మెట్ట |
| హద్దులు: తూ. రావెళ్ల చిన కోటయ్య భూమి, ద. అంగలకుర్తి ఆదిశేషయ్య వగైరాల భూములు, ప. అంగలకుర్తి సుబ్బయ్య భూమి, ఉ. రావులపల్లి కోటయ్య భూమి. డి.హెచ్.ఆర్. విలువ రూ.500/-; అమీనా విలువ రూ.25,000/- | | | | | | |
| 5. | 559 | 319 | 14-12 | 2-27 | 0.911 | మెట్ట |
| హద్దులు: తూ. & ఉ. సర్కారు డొంక, ద. రావెళ్ల చిన కోటయ్య భూమి, ప. బూదవాటి లింగమ్మ భూమి. డి.హెచ్.ఆర్. విలువ రూ.750/-; అమీనా విలువ రూ.20,000/-. | | | | | | |
| 6. | 443 | 622 | 5-68 | 2-90 | 1.171 | మెట్ట |
| హద్దులు: తూ. సర్కార్ డొంక, ద. రావెళ్ల వెంకయ్య భూమి, ప. రావెళ్ల బాలయ్య, S/o సుబ్బయ్య భూమి, ఉ. మామిళ్లపల్లి వెంకయ్య భూమి, డి.హెచ్.ఆర్. విలువ రూ.1,000/-; అమీనా విలువ రూ. 15,000/- | | | | | | |
| 7. | 296 | 638 | 11-90 | 1-78 | 0.721 | మెట్ట |
| హద్దులు: తూ. రావెళ్ల కోట్లింగయ్య భూమి, ద. నన్నూరి వెంకయ్య భూమి, ప. కుందేటి చెంచయ్య భూమి, ఉ. రావెళ్ల బాలయ్య భూమి. డి.హెచ్.ఆర్. విలువ రూ.500/-; అమీనా విలువ రూ.10,000/- | | | | | | |
| 8. | 693 | 662 | 8-00 | 2-00 | 0.810 | మెట్ట |
| హద్దులు: తూ. రావెళ్ల పెద కోటయ్య భూమి, ద. నేతి చిన్నబ్బాయి భూమి, ప. రావెళ్ల కోట్లింగయ్య భూమి, ఉ. రావెళ్ల వెంకయ్య భూమి. డి.హెచ్.ఆర్. విలువ రూ.700/-; అమీనా విలువ రూ.7,000/- | | | | | | |
| 9. | 569 | 736/1 | 14-00 | 1-95 | 0.790 | మెట్ట |
| హద్దులు: తూ. రావెళ్ల బాలయ్య భూమి, ద. అంగలకుర్తి సుబ్బమ్మ భూమి, ప. రావెళ్ల వెంకటేశ్వర్లు భూమి, ఉ. రావెళ్ల రంగయ్య భూమి. డి.హెచ్.ఆర్. విలువ రూ.600/-; అమీనా విలువ రూ.15,000/- | | | | | | |

వేలం వాయిదా 10.9.1996

తదుపరి విచారణ 17.9.1996

ఆర్. చెంచురామయ్య, M.Com., B.L., అడ్వొకేటు, కందుకూరు

# నెల్లూరు నాయచ్చెల్లీ
## విదూషకుడు

### జనార్ధనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి జిల్లాలోనే వున్నారు; 8 తేది వరకు ఇక్కడే వుంటారు.

### లక్ష్మయ్యనాయుడుపై రెవిన్యూ సిబ్బంది ధ్వజం

ఆత్మకూరు ఎమ్మెల్యే శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడుపై రెవిన్యూ సర్వీసెస్ సంఘాలు ఒంటికాలి మీద లేచి, రచ్చ చేస్తున్నాయి. ఒక గ్రామంలో పట్టాల పంపకం విషయంలో తాను చెప్పిన మాటను వినలేదని కోపగించుకొని — సంగం ఎమ్మార్వో శ్రీ అబ్దుల్ సత్తార్‌ను, లక్ష్మయ్య నాయుడు గారు తిట్టారట. ఇదేదో గదిలోపల, ఇద్దరి మధ్య జరిగి వుంటే గొడవ వుండేది కాదు. కాని, సంగం పిడబ్ల్యూడి గెస్ట్‌హౌస్ బయట నిలబడి, తన అనుచరులు, గ్రామస్తులందరి ఎదుటా ఎమ్మార్వోను నిలబెట్టి, పాలేరును తిట్టినట్లు తిట్టారట. అది పత్రికలకూ ఎక్కింది. దానితో జిల్లాలోని రెవిన్యూ వుద్యోగులందరూ కలిసి, నిరసన తెల్పారు. సమ్మెకూ సిద్ధమైనారు. ఇక నుంచి ఏ రెవిన్యూ వుద్యోగి ఎమ్మెల్యేల ఇళ్లకు, గెస్ట్‌హౌస్‌లకు వెళ్ల కూడదని తీర్మానించారు. ఈ లోగా కలెక్టర్ జోక్యం చేసుకొని, వారిని అనునయించి, జాయింట్ కలెక్టర్ చేత విచారణకు ఆదేశించారు. ఇప్పుడు కొంచెం కోపతాపాలు చల్లారి వున్నాయి.

అధికారులను నౌకరుల లాగా చూస్తేనే మాట వింటారనుకొనే సంస్కృతి ఆయనలోనే కాదు — తెలుగు దేశం వాదులు చాలా మందిలోనూ వుంది. ఇప్పుడు రాజ్యం వారిది; తలదించుకు పోవడం తప్ప పాపం ఎమ్మార్వోలు ఏమి చేయగలరు?

జెసి విచారణ కంటితుడుపే; తిట్టిన ఎమ్మెల్యేను విచారణకు పిలవకుండా, తిట్లు తిన్న ఎమ్మార్వోను ఏమి విచారిస్తా రాయన? అనుచరులను సాక్ష్యం చెప్పమనడం — పిల్లిపై ఎలుకను నేరం చెప్పమనడమే కదా?





### ఏటికి నీళ్లు

కడప వర్షాల వల్ల సోమశిల పొంగి, పొర్లింది. 37 టిఎంసిల కంటె ఎక్కువ నిలువ చేయలేరు కాబట్టి — క్రిందకు వదిలేస్తున్నారు. సంగం, పెన్నా ఆనకట్టలూ నిండి, సముద్రానికి పోతున్నాయి నీళ్లు. 50 వేల క్యూసెక్కుల నీరు క్రిందకు పారుతున్నదట ఇప్పుడు.

### సందాని భూఆక్రమణ— రికార్డులు స్వాధీనం!

మునిసిపాలిటీలో మాగుంట వర్గం నాయకుడు సయ్యద్ సందాని బాషా, పొదలకూరు రోడ్డులో ఆక్రమించిన 164 ఎకరాల భూమికి సంబంధించి రికార్డులు స్వాధీనం చేసుకోమని నెల్లూరు ఎమ్మార్వోను కలెక్టర్ గారు ఆదేశించినట్లు తెలిసింది. కలెక్టర్ డాక్టర్ సాంబశివ రావు ఆ భూమి సందర్శించి వచ్చారట. విచారణ పూర్తయ్యే వరకు పాస్‌బుక్‌ల వంటివేవి జారీ చేయ...రాదని జాయింట్ ఉత్తర్వులు జారీ చేసినట్లున్నారు.

* * *

గత వారం జమీన్ రైతులో వచ్చిన ఈ వార్తకు సంబంధించి సందాని ఒక వివరణ ఇచ్చారు. ఈ భూమిలో తన స్వాధీనంలో ఇప్పుడు కేవలం 6.67 ఎకరాల భూమి మాత్రమే వుందన్నది అతని వివరణ.

దివిరెడ్డి కోదండ రామిరెడ్డి నుంచి చేతులు మారి, పాశంరెడ్డి సుబ్బారామ రెడ్డి స్వాధీనంలో వున్నప్పుడు తాను భూమి కొన్నానని; దీనికి సంబంధించి కోర్టులో కేసు పెండింగ్ వుందని; తక్కిన భూమి ఆక్రమించింది మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి అనుచరులే తప్ప, తాను కానని చెప్పారు సందాని. మునిసిపాలిటీలో తాను చెప్పిన మాట వినడం లేదనే కక్షతో వివేకానంద రెడ్డి ఈ గొడవను బయటకు తీశారని వాపోయారు సందాని.

* * *

సందాని వివరణ సంతృప్తికరంగా లేదు. ఇక్కడ ప్రధాన సమస్య అది సీలింగ్ భూమి అవునా, కాదా అన్నదే! దానికి ఈ వివరణలో, సమాధానం లేదు; తన పేరుతో ఇప్పుడు ఆరెకరాలు వున్నమాట నిజమే కాని, తన బంధువులు, స్నేహితుల పేరిట ఎంత వుందేది; తాను ఇతరులకు ఎంతెంత విస్తీర్ణం అమ్మింది కూడా చెప్పలేదు. ఈ లావాదేవీలలో సృష్టించబడిన ఫోర్జరీ పత్రాలు, తప్పుడు డాక్యుమెంట్లు తదితరాలను కూడా దాట వేశారు. భూ ఆక్రమణ సమస్యను రాజకీయం చేసి, యేమార్చాలన్న యత్నం కన్పిస్తుంది ఆయన ప్రకటనలో! ఈ వివరణలు, సమాధానాలు వ్యర్థం; అది సీలింగ్ భూమి అవునో, కాదో నిర్ధారించి; సీలింగ్ అని తేలితే ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం సమంజసం.

* * *



24తేది మద్రాస్‌లో డాక్టర్ సి.ఎం.కె.రెడ్డి కుమార్తె హారిత, నెల్లూరీయుడు కె.నరసారెడ్డి కుమారుడు డాక్టర్ విజయ్ కె. రెడ్డి వివాహ సందర్భంలో వధూవరులను ఆశీర్వదిస్తున్న టిఎంసి నాయకుడు జి.కె. మూపనార్

దీనిపై కాంగ్రెస్‌కు చెందిన ముస్లిం యువ నాయకుడు షేక్ మొహిద్దీన్ ఒక ప్రకటన చేశారు. భూఆక్రమణలు సందాని వృత్తి అని; కొరడా వీధిలో మకాన్ స్థలం 100 అంకణాలు; చిన్నబజారులో ఖాజాపీర్ దర్గా స్థలం; పెద్ద పోస్టాఫీసు దగ్గర బడేపీర్ దర్గా స్థలం; మెక్లిన్స్ రోడ్డులో పార్కు స్థలం వంటివి చాలా ఆక్రమించి, అమ్ము కున్నాడని మొహిద్దీన్ ఆరోపణ. వీటి విలువ కోటి రూపాయలకు పైగా వుంటుందట. వక్ఫ్ బోర్డుకు చెందిన ఈ స్థలాల దురాక్రమణ లన్నింటి పైనా విచారణ జరిపించాలని మొహిద్దీన్ కోరుతున్నారు.

ఈ ఆరోపణలు, ప్రత్యారోపణల గొడవ కొనసాగుతూనే వుంది. ఒకరి పుట్టు పూర్వోత్తరాలు మరొకరు బయట పెట్టుకొంటున్నారు.

### వివేకాపై ఆరోపణ

మునిసిపల్ చేర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి మునిసిపల్ నిధుల వినియోగంలో అక్రమాలకు పాల్పడు తున్నారని మాగుంట వర్గం కౌన్సిలర్లు ఆరుగురు ఆరోపించారు. వివరాలకు స్థలం చాలినంత లేదు; మరోకసారి!

### డిఎస్‌ఒ వివరణ

నెల్లూరు పౌరసరఫరాల శాఖ కార్యాలయం బియ్యం స్మగ్లర్లకు నిలయంగా, అవినీతికి కేంద్రంగా మారిపోయి వుందని రెండు వారాల క్రితం వ్రాసిన వార్తపై డిఎస్‌ఒ శ్రీ ఎం. ...శత్ రెడ్డి సుదీర్ఘ వివరణ పంపారు. ... ఆరోపణలన్నీ అసత్యమని కొట్టి పారేశా రాయన.

కొరవ 9 పేజీలో



'అదిరింది అల్లుడు' చిత్రంలో మోహన్‌బాబు, రమ్యకృష్ణ

# నేనే అపరంజి, నన్ను ఎత్తుకపోతే?

-- కుష్బూ ప్రశ్న

# మీ బరువు ఎత్తగల్గే వారెవరండీ?

-- కోవై సరళ చురక

కుష్బూ తాను నటించే ప్రతి చిత్రంలోనూ ఆభరణాలు ధరించ వలసి వస్తే నకిలీ బంగారు నగలు పెట్టుకోదట. నకిలీ బంగారు ఆమెకు అలర్జీ. తనే సొంతగా చేయించుకున్న బంగారు నగలతో నటిస్తుందట. "అసలు బంగారమైతే, ప్రతి క్షణం జాగ్రత్తగా చూసుకోవాలి. లేకపోతే ఎవరైనా కాజేసే ప్రమాదం ఉంటుంది కదా?" అంది నటి కోవై సరళ. "అసలు నేనే నూటికి నూరు పాళ్ళు అపరంజి. నన్నెవరైనా మాయం చేస్తే చూసుకునేదెవరు?" అంది కుష్బూ నవ్వుతూ. " అసలే మీరు బరువు. మీలాంటి మీద అసలు బంగారం కూడా బరువు. ఈ రెండు బరువులనూ ఎలా ఎత్తు కెళ్లగలరు?" అంది సరళ ఫకాలున నవ్వుతూ.

## సినిమా కుటుంబం

చిరంజీవి తమ్ముడు నాగబాబు కొన్ని చిత్రాల్లో నటించాడు. కొత్తగా మరో తమ్ముడు కళ్యాణ్ హీరోగా రాబోతున్నాడు. నాగేశ్వరరావు కొడుకు నాగార్జున, డి.రామానాయుడు కొడుకు వెంకటేశ్ హీరోలుగా దున్నేస్తున్నారు. దాసరి కొడుకు కొత్త హీరోల లిస్టులోకి చేరబోతున్నారు. బాలకృష్ణ సరేసరి. ఇలా అందరూ వాళ్ళ కుటుంబంలోని వారికే ఛాన్సులు ఇస్తూంటే, ఇతరులకు సినిమా రంగంలో ప్రవేశం లేదా ' అని వాపోతున్నారు చాలా మంది. దీనికి గిరిబాబు సమాధానం "ఛాన్సెస్ ఆ పిచ్చివాళ్ళను పిచ్చినీయండి. ఇతరులకు కూడా సినిమా ఛాన్సులు ఇస్తూపోతే, అసలు ఇక సినిమాలు చూసే వాళ్ళెవరుంటారు?" అన్నా రాయన. ఈయన తన కొడుకు కోసం ఎంతో రిస్క్ తీసుకొని ఒక సినిమా తీశారు. అది కాస్తా వతికిల పడింది! మరెందుకు ఆయన ఆమాట అన్నట్లు?

## అమ్మాయి నిశ్చితార్థం

కృష్ణశ్రీని దర్శకునిగా పరిచయం చేసే పైచిత్రంలో ఆనంద్, ఇంద్రజ, రోజాకుమార్, చిన్న, సుధాకర్, తనికెళ్ళ భరణి, ఉత్తేజ్, సత్య, చిత్ర పాత్రధారులు. మాటలు: కొంపెల్ల విశ్వం, సంగీతం: వందేమాతరం శ్రీనివాస్, కథ. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: కృష్ణశ్రీ

## కస్తూరి సొంత సినిమా

చాలా కాలంగా నటి కస్తూరి సొంత చిత్రాన్ని నిర్మించే ప్రయత్నంలో ఉందట. కథ ఆమె రాసిందట. హీరోయిన్ జననీ జనకులుగా తన తల్లిదండ్రులే నటిస్తారట. కాని, డైరెక్టర్‌గా ఎవర్ని బుక్ చేయాలో అన్న ఆలోచనతో ఇంతకాలం కాలయాపన చేసిందట.

## ఓ అమ్మాయి ఓ అబ్బాయి

తెలుగు ప్రేక్షకులకు పరిచితులైన హీరోలు ఎందరో ఉండగా వినోద్‌కుమార్, శశికుమార్ వంటి కన్నడ హీరోలను బుక్ చేయవలసిన అగత్యం ఏముందని చాలా మంది అభిమానుల ప్రశ్న. మరో కొత్త కన్నడ నటుడు సంజయ్‌ని హీరోగా తెలుగు తెరకు పై చిత్రం ద్వారా పరిచయం చేస్తారట. బ్రహ్మానందం, ఎ.వి.ఎస్., తనికెళ్ళ భరణి, శుభలేఖ సుధాకర్, జుట్టు నరసింహం, మల్లికార్జునరావు ఇతర పాత్రధారులు. సంగీతం: మాధవపెద్ది, సురేష్. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: ఎ.ఆర్.కె.మోహన్.

# 'సగం ముద్దుకు నేను రెడీ'

## కమల్‌తో సరసానికి మీనా వురవుర

కమలహాసన్ ప్రతి చిత్రంలోనూ ఏదో కొత్త గెటప్‌లో కనిపించాలని తాపత్రయ పడతారు. "అపూర్వ సోదరులు"లో మరుగుజ్జుగా, "భారతీయుడు"లో వృద్ధుడుగా అద్భుతంగా నటించారు. "అవ్వాయ్ షణ్ముఖి" అనే తమిళ చిత్రంలో కమల్ ఎక్కువ భాగం మహిళగానే కనిపిస్తారు. చాలా వెరైటీగా ఉంటుంది లెండి. కథ అవసరం కొద్దీ నేనలా నటిస్తాను. అది తెలుగులో డబ్ అవుతుంది. ఆ తర్వాత మీరే మెచ్చుకుంటారు". అన్నాడు కమల్. ఈ చిత్రంలో నాయిక మీనా. కమల్ ప్రతి చిత్రంలోనూ నాయికను ముద్దు పెట్టుకునే దృశ్యమొకటి విధిగా ఉంటుంది. లేకపోతే అతని అభిమానులు ఒప్పుకోరట. "ఈ చిత్రంలో అలాంటిదేమైనా ఉంటుందా"? అని మీనాను అడిగితే "ఉంటుందో - ఉండదో ఇంత వరకు నాకు తెలీదు. కథకు అవసరమని రూఢిగా తెలిస్తే సగం ముద్దుకు మాత్రం ఒప్పుకుంటానేమో!" అంది. "సగం ముద్దు అంటే ఏమిటి?" అని అడిగితే, "హాఫ్ కిస్... రెండు పెదవులు తగిలితేనే కదా కిస్... ఒక్క పెదవి మాత్రం స్పర్శించేలా చేస్తే సగం ముద్దు అవుతుందిగా? అంతవరకే నేను అంగీకరిస్తాను." అంది మీనా చక్రాల్లాంటి కళ్ళు తిప్పుతూ, మందహాసం చేస్తూ.

## నటి బుద్ధి ప్రళయాంతకా:

అదెందుకు బుద్ధి పుట్టిందోకాని

కొరవ 13 పేజీలో

# ప్రేమదేశం: ప్రేమకంటే స్నేహం ఎక్కువా?

## చిత్రసమీక్ష ❖ అల్లూరు రహీం

ప్రేమ విశ్వ జనీయమైనది. ప్రేమ పేరు చెబితే పులకించని హృదయాలు అసలుండవేమో; స్వార్థంలేని ప్రేమ ఉదాత్తమైనది, ఉన్నత మైనదని ఎన్నో ప్రేమకథలు వచ్చాయి. అటువంటి ప్రేమకథ కాకుండా కాసింత కొత్త దనం మేళవించి తీసిన సినిమానే ప్రేమదేశం. టీనేజ్‌లో వున్న యువతీ యువకులను ఆకర్షించే హంగూ, ఆర్భాటాలు ఈ చిత్రంలో పుష్కలంగా వున్నాయి. కాలేజీలో కుర్రాళ్ళు తాము అభిమానించే అమ్మాయిల కోసం బస్టాపుల్లో పడిగాపులు కాయడం, వారి క్రీగంటి చూపుకై అల్లాడి పోవడం, అమ్మాయిలను సైట్‌కొట్టే విషయంలో కాలేజీల మధ్య గొడవలు శృతి మించని రీతిలో చూపబడ్డాయి. ప్రేమికుడు ప్రేయసి ప్రేమ పొందేందుకు ఎంతటి సాహసానికైనా సిద్ధపడతాడనే దానికి సృష్టించిన రెండు సన్నివేశాలు సరికొత్తగా వున్నాయి.

ప్రేమిస్తేనే కవిత్వం వస్తుంది. కాలేజ అబ్బాయిలు ప్రేమించే కవులౌతున్నారు. ప్రేమించిన అమ్మాయిని ఏ హృదయమూ మరవదు; ప్రేమను త్యాగం చేయడం అబద్ధం, గుళ్లో ఎందరో దేవుళ్లు వుండవచ్చు. ఆడదాని గుండెల్లో ఇద్దరు మగవాళ్లు వుండకూడదనే మాటలు ఆలోచనకు వచ్చేస్తారు. 'ఫ్రెండ్ షిప్ లాస్ట్స్ ఫర్ ఎవర్' అని చివరన దర్శకుడు సందేశమిస్తాడు. ఈ అంశమే సరికొత్త ప్రేమికులను ఆలోచింప జేస్తాయి. వన్‌వే ప్రేమకథ నేపథ్యంలో సాగుతుండే కథలోని ప్రముఖులంతా చివరికి స్నేహితులుగా వుండిపోదామనే ప్రేక్షకులను నిరాశ పరచినా, ఆ మలుపే కథకు నూతన మలుపు. గతంలో హృదయం వంటి భారమైన ప్రేమకథా చిత్రం తీసిన కథకుడు, దర్శకుడైన కదిర్ నిర్మించిన ఈ 'ప్రేమసందేశం' చూసిన వారుకూడా భారమైన హృదయాలతో హాలు నుండి బయట రావాలని తలపోసి మళ్లీ ఈ చిత్రం తీసినట్లుంది.

భారీ బడ్జెట్‌తో రెండు మూడు భాషల్లో అనువదించాలని కుంజుమోహన్ తీసిన ఈ చిత్రంలో అక్కడక్కడా కొన్ని సన్నివేశాల్లో తమిళ

కొరవ 13 పేజీలో

# శ్రద్ధాంజలి



మాకు పూజ్యులు,

మార్గదర్శకులు అయిన

# శ్రీ పోలంరెడ్డి ఈశ్వరరెడ్డిగారు

(ఈదూరు, నెల్లూరు జిల్లా)

*20-8-96 తేదిన మద్రాసులో స్వర్గస్థులైనారు.*

*వారి ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తూ.*

తమ్ముని కుమారులు :
కోడూరు మధుసూదన రెడ్డి
కోడూరు రామమోహన రెడ్డి

కుమారులు:
పోలంరెడ్డి రఘునాథరెడ్డి
పోలంరెడ్డి వేణుగోపాలరెడ్డి
పోలంరెడ్డి కృష్ణప్రసాద్‌రెడ్డి

మరియు కుటుంబసభ్యులు

## సంస్థలు

హోటల్ నిర్మల దక్షిణ్ (M/s డబ్ల్యూ.వీల్.మెరైన్ (ఇండియా) ప్రై. లిమిటెడ్)
హోటల్ నిర్మల మౌంట్‌రోడ్ (రెస్టారెంట్) మద్రాసు - 2.
నిర్మల వెజ్ హోటల్ (పారిస్) మద్రాసు - 1. నిర్మల హోటల్ (పారిస్) మద్రాసు - 1.
శ్రీ నిర్మల ఫైనాన్సియర్స్ (మద్రాసు ) ప్రై. లిమిటెడ్, మద్రాసు - 24.
నిర్మల ఆగ్రో ఫామ్స్ (మద్రాసు) ప్రై. లిమిటెడ్, మద్రాసు - 2.
వెన్‌సాకి హోటల్స్ (ఇండియా) లిమిటెడ్, మద్రాసు - 2.
నిర్మల బ్లూ మెటల్ వర్క్స్, (పల్లవరం) మద్రాసు - 43.
నిర్మల ఇండస్ట్రియల్ సర్వీసెస్ (పల్లవరం) మద్రాసు - 43.
నిర్మల క్రషింగ్ ఎక్విప్‌మెంట్ వర్క్స్, (పల్లవరం) మద్రాసు - 43.
నిర్మల గ్రానైట్స్, (కున్‌ద్రత్తూర్) మద్రాసు - 69. నిర్మల సినీ క్రియేషన్స్, మద్రాసు - 24.
నిర్మల స్టోన్ క్రషింగ్ వర్క్స్ (ఇర్‌మాయూర్) మద్రాసు - 49.
నిర్మల ట్రాన్స్‌పోర్ట్స్, మద్రాసు - 43 నిర్మల బ్లూ మెటల్స్ (కున్‌ద్రత్తూర్) మద్రాసు -69.
నిర్మల హోమ్ నీడ్స్, మద్రాసు - 24. నిర్మల ఫైనాన్సియర్స్ (పల్లవరం) మద్రాసు - 43.
ఆర్.ఆర్. బ్లూ మెటల్ వర్క్స్, (పల్లవరం) మద్రాసు - 43.
కిశోర్ కన్‌స్ట్రక్షన్స్ కార్పొరేషన్, మద్రాసు - 17.

## నెల్లూరు సంగతులు

10 పేజీ తరువాయి

విజవాడ గోపాలరెడ్డి దీన్ని ప్రారంభిస్తారు. రచయిత పప్పుపులును వెంకటేశ్వర్లు షష్టిపూర్తి సందర్భంగా ఈ కార్యక్రమం ఏర్పాటవు తున్నది. నాగభైరవ కోటేశ్వరరావు, వెంకటగిరి చిన్నరాజా డాక్టర్ వి.బి.సాయికృష్ణ యాచేంద్ర ఈ కార్యక్రమంలో పాల్గొంటారని ఆహ్వాన సంఘం కన్వీనర్లు బి.వి.నరసింహం, స్వయంపాకుల శ్రీనివాసులు తెలియ జేస్తున్నారు.

### మానవ సేవే మాధవ సేవ

మానవ సేవే మాధవసేవే అన్న సత్యాన్నెరిగి నెల్లూరు మదర్ థెరిస్సా హోం నిర్వాహకులు చేస్తున్న కృషిని ఒంగోలు పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి మాగుంట పార్వతమ్మ ప్రశంసించారు. ఇటీవల ఆ హోమ్‌లో జరిగిన కార్యక్రమంలో పాల్గొని ప్రసంగిం చారామె. ప్రేమానురాగాలతో మదర్ థెరిస్సా రోగులను దగ్గరకు తీసుకొని సేవ లందిస్తూ, అందరి చేత తల్లిలా కొనియాడబడు తున్నట్లు చెప్పారు. ఈ సందర్భంగా హోంలో వుంటున్న వృద్ధులకు విలువైన చీరలు, ధోవతులు పంపిణీ చేశారామె. సభలో మాజీ శాసన సభ్యుడు జె.కె.రెడ్డి, సర్కార్ పేపర్ మిల్ ఎం.డి దొడ్ల సుబ్బారెడ్డి పాల్గొన్నారు. దొడ్ల సుబ్బారెడ్డి ఇరవై బస్తాల బియ్యాన్ని హోమ్‌కు విరాళంగా అందించారు.

### కవిత్వం సామాజిక చైతన్యానికి ప్రతీక

ఇప్పుడు వస్తున్న ఆధునిక, అభ్యుదయ కవిత్వాలు సామాజిక చైతన్యానికి ప్రతీకలుగా నిలుస్తున్నాయని జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శి వీణా రమాపతిరాజా చెప్పారు. 25వతేది సింహపురి సాహిత్య సాంస్కృతిక అకాడమీ దొడ్ల పద్మావతమ్మ గ్రంధాలయంలో ఏర్పాటు చేసిన సభలో ఆయన మాట్లాడారు. ఈతరం కవులు, కవయిత్రులు భావాల సాయుధులై రేపటి తరం అభ్యుదయ పతాకలై నిలబడ కుంటే భవిష్యత్తుకు మార్గ దర్శకులు కరవవుతారన్నారు. ఆధునిక కవిత్వం - బహుమతి పొందిన కవితలలోని వాసిపాలను సాహితీ విమర్శకులు పాకాల వెంకట క్రిష్ణయ్య వివరించారు. సంస్థ నిర్వహించిన జిల్లా స్థాయి కవితల పోటీల్లో విజేతలను సంస్థ అధ్యక్షుడు పెరుగు రామకృష్ణ పరిచయం చేసారు. సంస్థ కార్యక్రమ నివేదిక, భవిష్యత్ కార్యక్రమాల వివరణ రచయిత జయంపు కృష్ణ వివరించారు. లలితగేయ సంగీత లహరి కార్యక్రమాన్ని ఎమ్.వి.రమణ రసకందాయంగా నిర్వహించి ఆహూతులను సంగీత రస డోలికల్లో ముంచెత్తారు. వివరస అకాడమీ కార్యదర్శి పాయసం సుబ్రహ్మణ్యం వందన సమర్పణ చేసారు.

### జెకె రెడ్డి దంపతుల నేత్రదానం

నెల్లూరు మాజీ ఎమ్మెల్యే జె.కె.రెడ్డి సతీ సమేతంగా 24వతేది నెల్లూరు నేత్రదాతల సంస్థలో సభ్యులుగా చేరారు. తమ తదనంతరం నేత్రాలను దానం చేస్తామని దంపతులు ఒకరి కొకరు సాక్షులుగా సంతకాలు చెయ్యగా, రెండవ సాక్షిగా వారి కుమార్తె జె.పద్మజారెడ్డి సంతకం చేసినట్లు నేత్రదాతల సంస్థ కార్యదర్శి శ్రీ టి. సుకుమార్ రెడ్డి తెలియ జేస్తున్నారు.

### రాజేశ్వరమ్మ గుడిలో సాంస్కృతిక కార్యక్రమాలు

వరలక్ష్మి వ్రతం పర్వదినాన్ని పురస్కరించుకొని రాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానంలో సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటయ్యాయి. మూలపేటలోని మహతీ సంగీత, నృత్య కళాశాల ఆధ్వర్యంలో ఇవి జరిగాయి. తొలుత అరుణకీర్తి రంగపూజ, టి.కిషోర్ కుమార్ గణపతి నృత్యం, అలరింపు, స్వరజతి, అష్టపది, థిల్లానా నృత్యాలు ప్రదర్శించారు. ఆర్.తేజస్వి ప్రదర్శించిన అడవి తల్లికి దండాలో, జానపద నృత్యం పలువురి ప్రశంసలు పొందింది. కార్యక్రమాలకు మాచవోలు సిస్టర్స్ గాత్రం, రాజ్యలక్ష్మి, శారద వయోలిన్, ఈశ్వరరావు మృదంగం, కె. సతీష్ తబలా, డి. కృష్ణారావు ఫ్లూట్ సహకారం అందించారు. వాట్యాచార్య ఎన్.వి. రమణయ్య, ఆయనశిష్యబృందానికి రాజరాజేశ్వరి దేవస్థానం కమిటీ ఛైర్మన్ కె.వి.రాఘవరెడ్డి బహుమతి ప్రదానం చేశారు.

### వేదసంస్కృత కాలేజికి కొత్త ప్రిన్సిపాల్

నెల్లూరు మూలపేటలోని వేద సంస్కృత కళాశాలకు కొత్త ప్రిన్సిపల్‌గా జి.వి. నరసింహం నియమితు లయ్యారు. హైకోర్టు ఫుల్ బెంచి తీర్పు మేరకు ఇంతకు ముందు ప్రిన్సిపల్ పి.వి. రమణయ్య, నరసింహంకు బాధ్యతలు అప్పగించారు.

### సంతాప సభ

నటుడు, నాటక రచయిత కోఆపరేటివ్ బ్యాంక్ రిటైర్డ్ బ్రాంచి మేనేజర్ గోమేధిసం మల్లిఖార్జునరావు సంతాప సభ 25వతేది టౌన్‌హాల్ రీడింగ్ రూంలో జరిగింది. సిద్దార్థ ఆర్ట్స్ అకాడమీ నిర్వాహకుడు బి.నవనాథరావు మాట్లాడుతూ మల్లిఖార్జునరావు ఒక మంచి కళాకారుడని, ఆయన నాటక రంగానికి చేసిన సేవలు వెల కట్టలేమన్నారు. బత్తిన చంద్రశేఖరరెడ్డి, ఉపా కృష్ణమూర్తి, గ్రద్దలూరు గోపాలరావు సభలో పాల్గొని తమ సహచరునికి సంతాపం ప్రకటించారు.

## చేపలమార్కెట్

4వ పేజీ తరువాయి

విమర్శిస్తూ గ్రాంటులు విడుదలయ్యాకే మునిసిపల్ నిధులివ్వాలని సూచించారు. ఎమ్పీ గ్రాంటు నుంచి విడుదలైన నిధులను అధికారులు వినియోగించలేదని ఊటుకూరు లక్ష్మయ్య ఆరోపించారు. సెప్టెంబర్ 14వతేది ఈ నిధులతో చేపట్టే పనులకు టెండర్లు పిలుస్తానని ఇన్‌ఛార్జి కమీషనర్ రామసుబ్బారెడ్డి సమాధాన మిచ్చారు.

పట్టణంలో వాడుకలో లేని ఇరిగేషన్ కాల్వలను ఆశాఖ మునిసిపాలిటీకి అప్పగించాలని సిపిఎం సభ్యుడు ఉన్నం బసవయ్య ప్రతిపాదిస్తూ, పలువురు సభ్యులతో ఒక లేఖ తయారు చేయించి ఛైర్మన్‌కు అందజేశారు. మునిసిపాలిటికి ప్రత్యేక సర్వేయర్ కావాలని సిపిఎం సభ్యుడు శ్రీమన్నారాయణ సూచించారు. టౌన్‌ప్లానింగ్ అధికారి ఏపనులూ చేయడం లేదని, సమావేశాలకు హాజరు కావడం లేదని, ఆయన్ను బదిలీ ప్రభుత్వాన్ని కోరుతూ కొందరు కౌన్సిలర్లు తీర్మానం చేయను రెడీ అయ్యారు. మునిసిపల్ ఛైర్మన్ వారికి సర్దిచెప్పి ఒకసారి టిపిఓకు హెచ్చరిక చేద్దామన్నారు.

అజెండాలోని అంశాలు రాత్రి 7-30 తరువాత చర్చించ నారంభించారు. అందుకు ముందు మూడు గంటల సమయం సభ్యుల దూషణ పర్వంతో కాలయాపన అయ్యింది. పలుదశల్లో కౌన్సిలర్లు ఊటుకూరు లక్ష్మయ్య, చాట్ల నరసింహారావు, విజయకుమార్, రాఘవరెడ్డి, షఫీ, ఛైర్మన్‌కు వీరసైనికుల వలె అండగా నిలబడి ప్రత్యర్థులను ప్రతి ఘటించారు. సమావేశం రాత్రి 12 గంటల వరకు సాగింది.

## చిత్రసమీక్ష

11వ పేజీ తరువాయి

లిపి కనిపిస్తుంది. ఎడిటర్లు బి.లెనిన్, వి.టి.విజయన్ల పనితీరును ప్రశ్నిస్తాయా సన్నివేశాలు. చివరి సన్నివేశంలో భారీ పోరాటం నడుమ ఆకాశంలో ఎగిరే అశ్రద్ధను ఎత్తి చూపుతుంది. కొత్త గ్రాఫిక్స్‌లో శ్రమ పడి తీసిన పాట ఏమంత బాగోలేదు. ఎ.ఆర్.రెహమాన్ వెస్టన్ సంగీతంలో సాహిత్యం 'క్రైమ్' అయిపోయింది. కాని స్క్రీన్‌ప్లే పటిష్ఠత వల్ల ప్రేక్షకుడు బోర్ ఫీల్‌కాడు.

ఆనంద్ (వినీల్), అరుణ్ (అబ్బాస్) దివ్య (టాబు) వేరువేరు కాలేజి స్టూడెంట్స్. ఆనంద్ భావ కవి. అతని అజ్ఞాత కలల సుందరి దివ్య. అనుకోని విధంగా అతనితో ఆమెకు పరిచయ మవుతుంది. ఆనంద్ వ్రాసిన కవితను పోటీకి పంపి 25వేల రూపాయలు వచ్చేలా చేస్తుంది. ఈ సంఘటనతో ఆనంద్ హృదయంలో దివ్య చోటు చేసుకొంటుంది. తర్వాత అరుణ్‌తో కూడ దివ్య పరిచయమై అతనూ ఆమెను ఆరాధించ నారంభిస్తాడు. కాని ఇద్దరిలో ఏ ఒక్కరూ దివ్యకు ఈ విషయాన్ని తెలియజేయరు. ఒకానొక సంఘటన ద్వారా ఆనంద్, అరుణ్ స్నేహితు లవుతారు. రొన్నాళ్లు సాగిన వారి స్నేహంలో దివ్య మూలంగా కలతలు రేగుతాయి. రోజు రోజుకూ ఆనంద్, అరుణ్ వివిధ చర్యల ద్వారా దివ్యకు దగ్గరవుతారు. మొదట ఆమె వాళ్లను మిత్రులుగానే ట్రీట్ చేస్తుంది. కాని తండ్రి ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం సలహాతో మంచి స్నేహితుని నుంచే భర్తను ఎన్ను కోవాలను కొంటుంది. కాని ఆనంద్, అరుణ్ తనను ప్రాణం కన్నా మిన్నగా ప్రేమిస్తున్నారని తెలుసుకొని కుమిలి పోతుంది. వారిలో ఎవరిని తన జీవిత భాగస్వామిగా ఎన్నుకోవాలో తేల్చుకోలేక బ్రతికినంత కాలం స్నేహితులుగా కొనసాగాలని, ఇద్దరినీ ఒకచోట జతచేర్చి తన నిర్ణయాన్ని ప్రకటిస్తుంది.

కాని ఈనాటి టీనేజ్ కుర్రాళ్లలో తామూహించుకొన్న ప్రేమ స్థానంలో నిజాయితీగల స్నేహం వుంటుందా అనేది అర్థం కాని ప్రశ్న. తండ్రి చెప్పే వరకు హీరోయిన్‌కు ప్రేమ 'బోధ' అర్థం కాక పోవడం కూడా విడ్డూరమే. హీరోయిన్ నిర్ణయం సందేశం వరకైతే బాగుంటుంది గాని, వాస్తవికతలో పలు సమస్యలు ఎదురు కాక తప్పవు. ఈ సినిమాను వురకలు వేసే రక్తంతో నిండిన యువకులు చూస్తారు కాబట్టి వారి ఆలోచనలన్నీ మరో రకంగా వుండవచ్చు.

నటీనటుల్లో వినీల్, తొలి సినిమా అయినా అబ్బాస్‌కు పోటీపడి నటించాడు. సీనియర్ నటీమణి అయిన టాబు ప్రేయసి పాత్రకు సరిపోయింది. హాస్యం కోసం ఎన్నుకొన్న విల్సన్ పాత్రకు వడివేలు మూర్తి పూర్తి న్యాయం చేకూర్చాడు. చిత్రంలోని రాప్ పాటల్లో ముస్తఫా.. ముస్తఫా బాగుంది. 'స్లో' పాటల్లో బొంబాయి చిత్రంలోని పాటలో ట్యూనింగ్‌నే రెహమాన్ మళ్లీ వాడాడు. భువనచంద్ర వ్రాసిన పాటల్లో సాహిత్యం అర్థమే కాలేదు. కాని చిత్రంలోని లోపాలన్నీ దర్శకుడు కదిర్ కప్పిపుచ్చుతూ చిత్రాన్ని జన రంజకం చేసాడన్నది వాస్తవం.

## జనవాణి

3వ పేజీ తరువాయి

ఎన్నో స్థలాలు భూబకాసురులు కబ్జా చేసిపారేస్తున్నా అడిగే నాథుడు లేకపోవడం దారుణం.

నెల్లూరు బి.శివరాంసింగ్

### డాక్టర్ రామకృష్ణమూర్తి నిరాడంబరులు

నెల్లూరు టౌన్‌లో మొదటి తరంలో పేరెన్నిక గల డాక్టర్ కొండూరు రామకృష్ణమూర్తి మరణం తీరనిలోటు. డాక్టర్‌గారు చాలా నిరాడంబరంగా వుండేవారు. అర్థరాత్రి సమయంలో రోగిని తీసుకెళ్లినా విసుక్కోక ఆప్యాయతతో పలుక రించి వైద్యం చేసేవారు. ఆ ఆప్యాయమైన పలకరింపుతోనే రోగికి సగం స్వస్థత చేకూరేది. పొరపాటున కూడా రోగుల వద్ద ఫీజు అడిగేవారు కారు. ఆయన నుంచి నేటి డాక్టర్లు ఎంతగానో నేర్చుకోవాలి.

-'గుంటూరు' కుటుంబం

### ప్రభుత్వ ఆలోచన దారుణం

నిధుల సేకరణలో భాగంగా కేంద్ర ప్రభుత్వం పబ్లిక్ సెక్టారు యూనిట్ల నుంచి షేర్లను ఉపసంహరించుకొనే ప్రయత్నాలను ప్రారంభించింది. దీనికి ప్రభుత్వం చెప్పే కారణాలు సమ్మతయోగ్యంగా లేవు. పెట్టుబడులను తీసి వేయడం ద్వారా ప్రభుత్వ సంస్థలను ప్రైవేటు పరం చేయడానికి రంగం సిద్ధం చేయడమే దీని వుద్దేశ్యం. జీవిత భీమా, ఓ.ఎన్.జి.సి, బ్యాంకులపై వేటువేస్తే సామాజిక రంగానికి వనరులు తక్కువై దేశం దెబ్బతిని పోతుంది. భారత దేశాన్ని ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీగా ప్రభుత్వం ఎందుకు మార్చాలని చూస్తున్నదో అర్థం కావడం లేదు.

నెల్లూరు పి.కరుణ

## సినిమా

11వ పేజీ తరువాయి

రంజితకు ఈ మారు ఎలక్షన్‌లో నిలబడి, ఎం.ఎల్.ఎ కావాలని ఉందట. ఆ మధ్య నటి రేవతి ఎన్నికల్లో పోటీ చేసినపుడు ఆమె తరపున రంజిత ప్రచారం సాగించిన తర్వాత ఆమెకు ఈ బుద్ధి పుట్టిందా?

### రాధిక దర్జా

తన ఫారెన్ భర్త సాయంతో నటి రాధిక ఇంగ్లాండ్ నుంచి 'రోల్స్‌రాయిస్' కారును తెప్పించు కుంది. ఆ కారుకు డ్రయివర్‌ను నియమిస్తే కారు పాడవుతుందని తానే దర్జాగా ఆ కారు నడుపుతూ కనిపిస్తూం దిప్పుడు!

## 50ఏళ్లక్రితం

3వ పేజీ తరువాయి

పెంచుకొంటూ, సమిష్టి దేశ సంస్కృతిని పోషించు కొంటూ రావలయును.

కొండమీదనే, దైవసన్నిధిలో కళాశాల ఉంచుట శ్రేష్ఠం. దృశ్యం అపూర్వం.

### పల్లెటూళ్లు

#### తర్లపాడు

గ్రామకమిటి వారు బీదా బిక్కి అందరికి గుడ్డలు పంచి వందులకు అభివందనాలు. వీరి కృపతోనే కిరసనాయిల్ 1/2బుడ్డికి బదులు ఒక బుడ్డి పోస్తున్నారు ...బీదోడు

#### మూరెళ్ల

గారపాటి రామక్రిష్ణయ్య గారింట్లో 7 1/2 బస్తాల బియ్యం దొరికితే పోలీసులు పట్టుకొని మునసబ్ స్వాధీనం చేసి వెళ్లినారు. కేసు పెట్టుటకు కలెక్టరు పర్మిషనుకు వ్రాశారంట ...కోటయ్య



# ఉత్తరక్రియలు

మా అభివృద్ధి కారకులు, మాతండ్రి

## పోలంరెడ్డి ఈశ్వరరెడ్డిగారు

(ఈదూరు, నెల్లూరు జిల్లా)

*20-8-96 తేదిన స్వర్గస్థులైనారు.*

ఉత్తరక్రియలు

*3.9.96 మంగళవారము రాత్రి - నిలుపు*

*4.9.96 బుధవారము ఉదయం - పెద్దకర్మ*

మద్రాసులో "పొన్‌మణి మాలిగై"

నెం.41, VI క్రాస్ స్ట్రీట్,

ట్రస్టుపురము,

కోడంబాక్కంలో జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుతాము

కుమారులు

*పోలంరెడ్డి రఘునాథరెడ్డి*

*పోలంరెడ్డి వేణుగోపాలరెడ్డి*

*పోలంరెడ్డి కృష్ణప్రసాదరెడ్డి*

*— మద్రాసు*

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore